# హెచ్చరిక

ఈ ఆయుర్వేద వైద్య సారామృతము అను పుస్తకము యొక్క సర్వ హక్కులు మాకే చెందియున్నవి కావున యితరులు యీ పుస్తకమును యేమాత్రము మార్పు చేసి గాని దీనివలెనే గాని ముద్రించ గూడదు అట్లు ముద్రించినచో మాచే నొనర్పబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులవుదురని యిందు మూలముగా తెలియ జేయుచున్నారము.

ఇట్లు
కొండా శంకరయ్య
పుస్తకముల వ్యాపారము
మహంకాళివీధి, సికింద్రాబాద్.

# విషయసూచిక

శ్రీరస్తు
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ఆయుర్వేద
# వైద్యసారామృతము

## మొదటి ప్రకరణము

### అష్టస్థానములు

ప్రథమమున చికిత్స జేయుటకు పూర్వము అష్టస్థానముల సావధానుడై వైద్యుఁడు బరీక్షింపవలయును. అష్టస్థానము లెవ్వియన

1. నాడి, 2. స్పర్శ, 3. రూపము, 4. శబ్దము, 5. నేత్రములు, 6. మూత్రము, 7. పురీషము, 8. నాలుక, వీనిని చక్కఁగా నౌషధ మొసంగువేళ జూడనగును.

### అజీర్ణవ్యాధిగలవాని నాడీపరీక్ష

అజీర్ణవ్యాధి గలవానియొక్క నాడీచలనము మదగజయానము వోలెనుండును. అగ్నిదీపకనాడి సరియైన స్థితిలోనుండక నిద్రించెడి కాకివలెనుండి జఠరాగ్నిని సన్నగిలజేయును, స్త్రీసంగమనాడి ప్రథమమున నగ్నిదీపక నాడివలెనుండి రానురాను యతివేగముగా చలించుచుండును. అజీర్ణముచే మలబద్ధక వ్యాధివలన బీడికపఁబడువానినాడి హంసగమనము వోలె చలించుచుండును.

### అజీర్ణజ్వరమును దెలియు విధము.

వలు వైద్యవిద్యాశిఖామణులీ యజీర్ణములు చతుర్విధమని నుడివియున్నారు. అవి యేవన,

1. రసశేషము 2 నిష్ప్రష్టము 3. విధూమము 4. ధూమము రసశేష యజీర్ణముచే బీడింపఁ బడుచుండిన యెడల శిరోవేదన యధికముగా నుండును

2. నిష్పష్టా జీర్ణముచే బాధఁబడు చుండిన యెడల యొడలంతయు నొచ్చుచుండును. ఏపని జేయుట కుత్సాహముండదు.

3. విధూమాజీర్ణ లక్షణము గలవానికి పులిత్రేపులు మిక్కుటముగా వచ్చుచుండును. నోట నీళ్లూరుచుండును.

4. ధూమాజీర్ణ వ్యాధిగ్రస్తునకు తఱచుగా త్రేపులు వచ్చుచుండును. ఎప్పుడు కడుపు నిండినటులే యుండును.

ఇవి యన్నియు గలుగుటకు హేతుభూతమజీర్ణవ్యాధియే యని యెఱుంగుదురుగాక.

భిషజుండు, వాతపైత్య శ్లేష్మ దోషములను, ఆమదోషాదులను, నాడిని బరీక్షించి తెలుసుకొనవలయును. ఇంకను పాదగతనాడి, నాసానాడి, కంఠనాడ నాభిగతనాడియని నాడులలో నాలుగు భేదములున్నవి. అట్టివానినిగూడ వైద్యుఁడు బరీక్షించుటావశ్యకమై యున్నది.

## అజీర్ణ జ్వరలక్షణము.

అజీర్ణ వ్యాధిగ్రస్తుఁడు యంతర్గతమందు జ్వరముగలిగి సర్వదా పీడింపఁ బడుచుండును. జీర్ణకోశము బద్ధకించి యుండును. వెక్కిళ్ళు ఆవలింతలునుగూడ గలిగియుండును. ఏపని జేయుటకు నిరుత్సాహియై యుండును. కాళ్ళు, చేతులు మండుచుండును. పిక్కలు వాచును. కడుపు నిండినట్లు భుజించిన వానివలె త్రేపుచుండును. పులిత్రేపులుగూడ వచ్చుచుండును. నిద్రయందు కలవరించును.

## అభిఘాత జ్వర లక్షణము.

అపరిమితముగా బహుదూరము నడచుటచే గలిగిన శ్రమవలను, ఎక్కువ పనిచేసి యలసినను, యీజ్వరము వచ్చుచుండును. శరీరమునందలి యంగములెల్ల నొచ్చుచుండును. వొడలంతయు చమటపట్టును. దప్పిక

యెక్కువగా నుండును. భుజింపవలెనను కోరికయుండును. శ రీ ర ము పులకరించును.

అస్థిగతజ్వర లక్షణము.

అస్థిగత జ్వరముచే పీడింపబడుచున్నవాని శరీరము పైకిచల్లగనే యుండును గాని లోపల యత్యుష్ణముండును. జ్వరముగూడ నస్థిగతమై బాధించు చుండును. ఒడలుకృశించి పాండువర్ణము గామారును. ఎల్లప్పుడు దగ్గుచేత పీడింపబడుచుండును.

అసాధ్య సన్నిపాతములు.

సన్నిపాతములయందున నేడుమాత్ర మసాధ్యములని వైద్య శాస్త్ర సమ్మతమైయున్నవి. అవియేవన.

1. హృద్దాహసన్నిపాతము 2. అంతకసన్నిపాతము 3. భగ్ననేత్ర సన్నిపాతము, 4. కంఠకుబ్జసన్నిపాతము, 5. రక్తోష్ఠసన్నిపాతము, 6. శీతాంగసన్నిపాతము, 7. అభిన్యాససన్నిపాతము.

అంతక సన్నిపాత లక్షణము.

అంతకసన్నిపాతలక్షణము గలవా డపరిమిత దాహము గలిగి యుండును. బుద్ధి నిలకడగానుండదు. తాప మధికముగనుండును, తల యూచుచుండును. ప్రలాపములాడును. వాంతులుగలిగియుండును. జ్వర మెక్కువగానుండును. వెక్కిళ్ళువచ్చుచుండును. ఈసూచనలు గలవాడు బ్రతుకుట దుస్తరము. ఇది యసాధ్యమని చెప్పంబడియున్నది.

అభిన్యాస సన్నిపాత లక్షణము.

అభిన్యాసలక్షణమున వాత, పిత్త, శ్లేష్మము లేకీభవించియుండును. ముఖము మెరుగుపెట్టినట్లు నున్నగానుండును. రోగి యెక్కువగా నిద్ర బోవుచుండును. దేహము విరుగగుద్దిమ్మినటులుండును. తాపముచే పీడింపం బడుచు నిస్సత్తువ నిస్పృహ గలిగియుండును. దాహముగూడ నెక్కువగా

నుండును. ఇట్టివాఁడుగూడ జీవించుట దుస్తరము. ఇది యసాధ్యమని చెప్పఁబడియున్నది.

## అశుభనక్షత్రములు.

ఈక్రింద జెప్పబడిన నక్షత్రములయందుగాని, తిథులయందుగాని, వారములయందుగాని, మానవునకు రోగమువచ్చినయెడల జీవించుట దుర్లభమని యెఱుఁగవలెను.

నక్షత్రములు:—భరణి 2 ఆర్ద్ర 3. ఆశ్లేష 4. మఖ 5. పుబ్బ 6. స్వాతి 7. విశాఖ 8. పూర్వాషాఢ 9. పూర్వాభాద్ర 10. శతభిషము 11. ఆర్ద్ర వీటియందు జ్వరమువచ్చినయెడల తప్పక మృతినొందును.

వారములు:—ఆదివారము, మంగళవారము, శనివారము.

తిథులు:—పాడ్యమి, చవితి, షష్ఠి, నవమి, ద్వాదశి.

## అతిసారలక్షణము.

వ్యాధిగ్రస్తుడు అతిసారముచే బీడింపంబడుచున్నయెడల యాతని మలము కొంచెము ఘనీభవించియుండి నురుగుతో గలసియుండును. బొడ్డుక్రింద బాధజనించును కడుపునొప్పి యతిశయముగానుండును. శరీరము బడలికగానుండును.

## అతిసారము.

అపక్వశాకాదుల భుజించుటచేతను, మిక్కిలి శీతలమగు పదార్థముల భుజించుటచేతను, మిక్కిలి వేడిగలిగించు పదార్థముల భుజించుటచేతను, అతిశయముగా భుజించుటచేతను అతిసారము గలుగుచుండును.

## అసాధ్యాతిసారము.

మలము యెక్కువగా వచ్చుచున్నను, తేనెరంగు కలిగియున్నను మిశ్రవర్ణము గలిగియున్నను, అతిదుర్గంధముగా వచ్చుచున్నసాధ్యాతిసారమని దెలియవలెను.

## అగ్నిమాంద్యమున కౌషధము.

అగ్నిమాంద్యమున్న యెడల, తెల్లజీలకర్ర, బెల్లము కలిపి మెత్తగా నూరి మాత్రలుజేసి పుచ్చుకొనిన తగ్గును. ఈయౌషధము వాతరోగములను, విషజ్వరములనుకూడ నాశము వేయుననుటకు సందియము లేదు.

## అజామోదచూర్ణము.

వెల్లుల్లి, ఓమము, సైంధవలవణము, మిరియములు, సమభాగములుగజేసి, జిల్లేడుచిగుళ్ళ రసమున నస్యముజేసిన యెడల నాహికజ్వరములు నివారణమగును.

## అమృతసంజీవినీరసము.

ఈయౌషధము సేవించినయెడల సన్నిపాత దోషములు నివారణమగును.

కటుకరోహిణి, గంధకము, ఇంగిలీకములోని రసమును, వీనిని సమభాగములుగా జేర్చి గుంటగలగరాకు రసమున మూడుదినములు కల్వములో చక్కగా మర్దించి కర్షప్రమాణము మాత్రలుజేసి అల్లపురసము ననుపానముగా బెట్టుకొని సేవించవలెను దీనినే అమృత సంజీవినీరసమని పెద్దలు జెప్పుదురు.

## అన్నివ్యాధుల కౌషధము.

గోరోజనము, కేసరి, కస్తూరి, పచ్చకర్పూరము, చనుబాలలో మర్దించి మాత్రలుజేసి, నీరు అనుపానముగాబెట్టి, యిచ్చినయెడల మంచిది.

## అగ్నికుమారరసము.

వెలిగారము, శొంఠి, పిప్పళ్లు, అభ్రకము, రససింధూరము, ఇంగిలీకము, రసము, మొదలగువాటిని తులము తులము చొప్పున ఖల్వమున నుంచి, అర్ధతులము కేసరి (కుంకుమపువ్వు) గలిపి గుంటగలగరాకు రసమున నొకదినము చక్కగా మర్దించవలెను. కరక తాండ్ర యుసిరికల

కషాయమున రెండవదినము చక్కగా మర్దించి, కర్షప్రమాణ (మినవ గుంజయెత్తు) మైన మాత్రలను జేసుకొనవలయును. ఇది యనుపానభేదములచే సేవించినయెడల సమస్తవాతములు నివారణమగును. పథ్యము చప్పిడి.

## అన్నహితమున కౌషధము.

ప్రత్తిగింజలలోని పప్పును వేయించి చూర్ణించి, పిప్పళ్ళు, జీలకఱ్ఱ, వేలాలు చూర్ణముచేసి పైనజెప్పబడిన ప్రత్తిగింజలచూర్ణమును మిశ్రితముసర్చి, చక్కెరగలిపి భుజించినయెడల అన్నహితవులుగలుగును. వాంతులున్నచో తగ్గును.

## అతిసారభేదములు.

ఈ యతిసార రోగ మూరువిధములుగా నున్నది.

1. వాతాతిసారము.

గర్భమున ప్రేగులు గుఱ్ఱుమని యరుచుచుండును. బంకతోడను నురుగుతోడను గలసి మలము యెఱ్ఱనిరంగుగలిగి వచ్చుచుండును.

2. పైత్యాతిసారము.

అపరిమితమైన దాహము గలిగియుండును. మూర్ఛగూడ గలుగును. మలమతి దురంధమై నల్లగను, యెఱ్ఱగను, పసుపువర్ణముగను వచ్చుచుండును.

3. శ్లేష్మాతిసా ము.

గుదస్థానమున మలవిసర్జన సమయమందు నొప్పిబుట్టుచుండును. అన్నహితవుండదు. మలము రక్తముతో గలసి నల్లగను, తెల్లగను వచ్చుచుండును.

## అతిసారమున కౌషధము.

నల్లమందు, జాజికాయ, వెలిగారము, జీలకఱ్ఱ గంధకము సమభాగములుగా జేర్చి పొడిజేసి ఈపొడియెంతయెత్తుండునో యంతకు సమానముగా దానిమ్మగింజలుగలిపి చక్కగా ఖల్వమున మర్దించి దానిమ్మడిప్పలలో పై యౌషధముంచి గోధుమ పిష్టముతో పైనమూసి, నిప్పులో బెట్టి బాగుగా యుడికించవలెను. చక్కగా యుడికి చల్లారిన పిమ్మట, మరల ఖల్వములోనుంచి, మాత్రలు గట్టుటకు పనికివచ్చువరకును మర్దించి,

శనగగింజలంత మాత్రలు జేసుకొనవలయును అతిసారముగల రోగికి దినమునకు పూటకొకటింటికి రెండుమాత్రలిచ్చినయెడల, స్వస్థుడగును. ఈయమోఘమైన యౌషధమువలన సకలాతిసారములు నివారణమగును.

## అజీర్ణవ్యాధి.

రాత్రివేళలందు యెక్కువగా మేల్కొనుటచేతను, వేళదప్పి నిద్రించుటచేతను, భుజించుటచేతను, ఎక్కువగా నీరుత్రాగుటచేతను, అమితముగా భుజించుటచేతను, ముష్టిమైథునాదులు జేయుటచేతను యీవ్యాధి సంభవించుచున్నది. అజీర్ణవ్యాధి గలవానికి దాహమెక్కువగా నుండును. నోట నీరూరుచుండును. పుల్లత్రేపులు వచ్చును. వాంతులగును. మలము బద్ధకించును. అరుచి కలుగును.

## అజీర్ణమున కౌషధము.

ఏడుమానికల నీటిలో పండుకుంకుడుకాయలువైచి, మూడుదినములైనపిమ్మట, చక్కగా పిసికి వడియగట్టి యొకమృణ్మయపాత్రిలో బోసి ప్రొయ్యిమీదనుంచి, మైనముగువరకు చక్కగా కాచవలెను. తదుపరి యా మైనముదీసి చిన్నమాత్రిలుగట్టి అజీర్ణరోగి కిచ్చినయెడల సర్వాజీర్ణములను హరించును.

అజీర్ణముచే కడుపుబ్బినందులకు, వాతమునకు, దివ్యౌషధము.

వాముయొకభాగము, మిరియములు రెండుభాగములు, శొంఠి మూడుభాగములు, జీలకర్ర నాల్గు భాగములు, త్రివిధక్షారములు మూడుతులములు, కాచలవణము, సముద్రలవణము, బిడాలవణము, సౌవర్చలవణము నాల్గుతులములు, సైంధవలవణము నాలుగుతులములు నొక మట్టిపాత్రయందుంచి నీరగువరకు దీపాగ్నిచే కాచవలెను పిమ్మట రసములన్నియు నందునగలిపి పొడిజేసి, గాజుబుడ్లలో భద్రపఱచుకొనవలయును పూటకు బేడయెత్తు యుష్ణోదకమున గలిపి సేవించిన యెడల సకలాజీర్ణవ్యాధులు నివారణమగును ఉసిరికపప్పు కషాయములో సేవించినయెడల కడుపుబ్బుట వాతముహరించును ఇచ్ఛాపథ్యం.

### అజీర్ణముచే కడుపుబ్బినందుల కౌషధము.

తులము శొంఠి, అరతులము వాముపొడిచేసి, మిరియములు అర తులముదీసికొని పొడిచేసి కషాయముపెట్టి, పైచూర్ణములో యీమిరియముల కషాయము గిద్దెడుకలిపి ఖల్వములోనుంచి చక్కఁగానూరి, మాత్రలుకట్టుట కుపయోగించు సమయమున పిప్పరమెంటు ద్రావకము షుమారు 20 చుక్కలుగలిపి మర్దించి శనగగింజలంత మాత్రలుగట్టి పూటకు యొకటి చొప్పున సేవించినచో యజీర్ణమువలన గలిగిన కడుపుబ్బులు తగ్గును ఇచ్ఛాపథ్యము.

### అన్ని అజీర్ణములకు

త్రికటుకములు ఆరుపలములు రెండుకర్షముల ప్రమాణము ఆకుపత్రి, యాలకులు, లవంగపట్ట, మోడి, రెండు ఫలములు, కరక్కాయలు, ఆరుపలములుగలిపి చక్కఁగా పొడిచేసి, ఆరుశేర్ల బెల్లములో గలిపి బాగుగా మర్దించి, అర్ధపలముయెత్తు మాత్రలుచేసి పుచ్చుకొనినయెడల సకలవిధాజీర్ణములు నివారణమగును.

### అన్ని విరేచనములు తగ్గుటకు.

కొంచెము కుంకుమ, తొమ్మిది మిరియములు, బేడయెత్తు రససిందూరము, అణాయెత్తు నల్లమందుజేర్చి యొకకల్వమునసుంచి చక్కఁగా మర్దించి కుంకుడుగింజంత మాత్రజేసి భుజించినయెడల సమస్తమైన అజీర్ణములు నివారణమగును ఇచ్ఛాపథ్యము.

### అన్నహితవునకు వాంతులకు.

లవంగములైదు, మిరియములైదు, పిప్పళ్ళయిదు, వాటికి తగినంత శొంఠి వాముగలిపి, మట్టిమూకుడునందుంచి గిద్దెడు నీళ్ళుబోసి, పైన గాలిపోకుండ గుడ్డగట్టి ఒకచోట భద్రముగా నుంచుకొనవలెను, ప్రాతఃకాలమున మరియొకగిన్నెలో తేర్చి, సేవించినయెడల వాంతులుతగ్గును, అన్నహితవు గలుగును.

### అ భి ఘా త జ ము.

ఇది వక్షస్థలమందలి రక్తముచెడుటవలన గలుగను దగ్గుపుట్టును.

ఇ ది

మొ ద టి ప్ర క ర ణ ము.

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

## ఆయుర్వేద

# వైద్య సారామృతము



## (రెండవప్రకరణము)

### ఆరోగ్యమాత్రపరీక్ష.

మూత్రమునందుంచిన తైలబిందువు, హంస, నీటికోడి, చెఱువు, పద్మము, ఏనుగు, వింజామరము, గొడుగు, తోరణము, మేడ మొదలగు వానియొక్క యాకారముగా వ్యాపించినయెడల రోగికిఆరోగ్యము గలుగును. కాబట్టి వైద్యుఁడు చికిత్స చేయవలెను.

### ఆయుర్విచారము

వైద్యుఁడు ప్రథమమున వ్యాధిగ్రస్తునియొక్క ఆయువును పరీక్షించవలయును. ఆయువు విస్తారముగా నున్నయెడల చికిత్సచేయవలెను అట్టి చికిత్సగూడ సఫలమగును.

### ఆయుర్లక్షణము.

రోగపీడితునియొక్క కన్నులు, చెవులు, మొగము, మొదలగునవి సౌమ్యముగానుండి మంచివాసనదెలియుచున్నయెడల అట్టిరోగిజీవించును.

రోగియొక్క కాళ్ళుచేతులు వెచ్చగనుండి స్వల్పదాహముగలిగి నాలుక అతిమృదువుగ నున్నయెడల అట్టిరోగి జీవించును.

రోగికి జ్వరమువచ్చినపుడు చెమటలేకయుండినను ఊపిరి ముక్కునుండి యథాస్థితిగ వచ్చుచున్నను, కంఠము కఫహీనముగా నున్నను అట్టిరోగి బ్రతుకును ఇది తప్పదు.

## ఆర్తవవృద్ధిలక్షణము.

స్త్రీలకు ఆర్తవము మిగుల వృద్ధిఁబొందినయెడల దానియందు దౌర్గంధ్యము ఒడలుఁవిరుపు మొదలగునవి గలుఁగును.

## ఆర్తవక్షయలక్షణము.

స్త్రీలకు ఆర్తవక్షయమునందు యథోక్త సమయమున రజస్సు యొక్క నిర్గమము లేకపోవుట లేక స్వల్పముగ బయలువెడలుటయే గాక భగమందు వేదనజనించుదు.

## ఆర్తవక్షయవర్ధనము.

స్త్రీలకు ఆర్తవక్షయమునందు చేఁదు, పులుసు, ఉప్పు, ఉష్ణము జడము, ఆగువస్తువులు మఱియు తాపముపుట్టించెడు అన్నము మఱియు ఫలములు, శాకములు, శీతలమైన పావనవస్తువులు, మొదలగువానియందు ఇచ్ఛ గలిగియుండును.

## ఊరుస్తంభచికిత్స.

తెల్లగలిజేరువేళ్లు, శొంఠి, దేవదారు, కరకపిందెలు, జీడివిత్తులు, తిప్పతీగ మొదలగువానిని సమముగ కషాయముగాచి అందు దశమూలముల చూర్ణముగాని లేక ఆవుపంచితములో శుద్ధిచేసిన గుగ్గిలముగాని కలిపి త్రాగిన ఊరుస్తంభవాతము హరించును.

## ఆమవాతమునకు భల్లాదిచూర్ణము.

జీడిగింజలు, నువ్వులు, కరకబలుపు, వీనిని చూర్ణించి బెల్లమునుచేర్చి పుచ్చుకొనినను లేక శొంఠి చూర్ణమును బెల్లముతో చేర్చి పుచ్చుకొనిన ఆమవాతము కటిశూలము మొదలగునవి నివర్తించును.

## ఆ మ ల క్యా ది ఘృ త ము.

ఉసిరికపండ్లరసము చెరకురసము కరకపిందెలరసము వీని రసములకు నాల్గవపాలు నెయ్యిచేర్చి ఘృతము మిగులువరకుగాచి సేవించినయెడల పిత్తగుల్మము నివర్తించును.

## ఆ హ్ని క జ్వ ర ల క్ష ణ ము.

ఆహ్నిక జ్వరమున్నయెడల కన్నులునొప్పి, శిరోవేదన, కడుపు నొప్పి, ప్రక్కలునొప్పి, అపథ్యమునందిష్టము, పులకరింపు, దప్పి, తాపము, శైత్యము, అతిశయముగా నిద్రించుట, కడుపు, ముఖము వాళ్ళు వాచుట ఒడలంతయు తెల్లగామారుట కన్నులు పచ్చగానుండుట నఖము లందును కనురెప్పలయందును రక్తహీనమైయుండుట అతిశయముగా శ్లేష్మలుచుండుట అఱచేతులు కాళ్లు మండుచుండుట మొదలైనవి యుండును.

## ఆహ్నికజ్వరమునకు పేర్లు.

ఏకాహ్నికము, ద్వ్యాహ్నికము, త్ర్యాహ్నికము, చాతుర్థికము, పంచా హ్నికము, అర్ధరాత్రము, పాక్షికము, మాసికమునను యష్టవిధ జ్వరము లతో వాతపిత్త జ్వరములు సంకమైనయెడల యట్టిదానికి ఆహ్నిక జ్వరమని నామధేయము.

నామధేయము.

## ఆ మా తి సా ర చి కి త్స.

కురువేరు, మారేడుఫలము, తుంగముస్తెలు, కొత్తిమిర, శొంఠి, మొదలగువానినిదంచి యొక పాత్రలోవేసి పొయ్యిమీదనుంచి కషా యముగాచి, అట్టి కషాయమును ఆమాతిసారముచే బాధపడువాని కిచ్చిన యెడల నివర్తించును.

## ఆ నం ద భై ర వి.

వెలిగారము, నాభి, పిప్పళ్ళు, ఇంగిలీకము, మిరియములు మొద

బాషాణానిని శాస్త్రరీతిగా శుద్ధిజేసుకొని సమభాగములుగాతూచి ఖల్వము నసుంచి నిమ్మపండ్ల రసముతో మర్దించి గురిగింజప్రమాణమైన మాత్రలుజేసి ఛాయయందు శోషింపించి, దినమున కొకమాత్ర భుజించినయెడల సకల వ్యాధులు నశించును ఈఆనందభైరవిని మరియొక విధముగా జేసెదరు.

౨. రెండుతులములు ఇంగిలీకము, నాలుగుతులములు నాభి, రెండు తులములు పిప్పళ్ళు రెండుతులముల మిరియములు రెండుతులములశొంఠి, దీసుకొనివచ్చి ఖల్వమునందుంచి మూడహోరాత్రిమును విడువక నిమ్మ పండ్లరసమున మర్దించి, ఉప్పెలుకట్టి గట్టిమూతగలిగిన సీసానుంచి భద్రి పరచుకొనవలెను. మినపగింజలంత మాత్రలుజేసి యిచ్చినయెడల సమస్త వాయువులు నివారణమగును. అగ్నిమాంద్యము, అజీర్ణము నివారణ మగును. ఇచ్ఛాపథ్యము.

ఆఘ్రాణ భేదికౌషధము.

నారికేళఫలము నొకదానిని గొనివచ్చి, యొకరంధ్రము జేసి, యందుననుండుజలమునంతయు నందున నేయుంచి నేపాలపువప్పును యాంగల మునవైచి గాలిపోకుండునటుల మూతబెట్టవలెను. ఆకొబ్బరికాయను యేనుగుమాత్రముపోయుస్థానమున పాతిపెట్టి, యటులనే యేడుదినము లుంచి, తదుపరి బయటికిదీసి, యాకాయను బట్టె మాత్రముపోయు స్థానమున పాతిపెట్టవలెను, వారముదినములైన పిమ్మట బయటికిదీసి యాకాయను పగులగొట్టినచో లోపల కాయయంతయు క్రుళ్ళియుండును ఆక్రుళ్ళినకొబ్బరనంతయు నొకపాత్రలోవైచి పొయ్యిమీద నుంచి కాచినయెడల పైనచమురుతేలును ఆతైలమునొకసీసయందున భద్రపఱచు కొని యేపువ్వుపైన నైనను బోసి యాఘ్రాణించిన యెడల భేదులగును ఎన్నిసారులు వాసనజూచిన యన్నిసారులు విరేచనములగును.

ఆమ్లపిత్తమునకు బూడిదగుమ్మడి లేహ్యము.

చక్కని గుమ్మడికాయ దీసుకొనివచ్చి దంచినరసము నూరుపల ములు గోక్షీరము నూరుపలములు ఉసిరికవొలపు చూర్ణము యెనిమిది పలములు పంచదార ఎనిమిదిపలములు నొక మృణ్మయపాత్రయందుంచి

లేహ్యమగునటులవండి ప్రతిదినము నొకతులముగాని అరతులముగాని భుజించినయెడల నామ్లపిత్తము నివారణమగును.

## ఇంద్రలుప్త చికిత్స.

లక్క, గురివెందవ్రేళ్లు, అతిమధురం, నాభి, మొదలగువానిని దీసికొనివచ్చి పులికడుగులో ఖల్వమునయుంచి చక్కగా మర్దించి యొక పాత్రలోనుంచి, యెనిమిదిరెట్లు మంచినూనెవోసి పొయ్యిమీదనుంచి కాచి సరిగా కాగి తైలపక్వమునకువచ్చిన తదుపరి యొకగాజుకుప్పెలో యీతైలమునుంచుకొని ప్రతిదినము తలకుబూసుకొనుచుండిన యెడల బట్టనెత్తివానికి సైతము వెంట్రుకలు మొలచుననుటకు సందేహములేదు.

## ఉదరవృద్ధిలక్షణము.

గర్భమువృద్ధిజెందెడికాలమున ఉదరము, మొదలగు అవయవములు మిగులవృద్ధిజెందెనేని మిగుల చెమట ప్రసవకాలమున మిగుల వేదన ఇవి కలిగియుండును.

## ఉబ్బుకామిలకు చికిత్స.

గోఘృతమున కాకరాకురసము నాల్గుబొట్లువైచి ప్రాతఃకాలమున నొసంగవలయును. ఇటుల మూండుపూటలు సేవించినయెడల ఉబ్బుకామిలలు కుదురును. నూనె, ఆవ, అవిశ, గుమ్మడి మొదలగునవి భుజింపరాదు.

## ఉదావర్త చికిత్స.

సర్జక్షారము యవక్షారము అప్పళాక్షారము పంచలవణములు ఓమము చిత్రమూలము శొంఠి పిప్పళ్ళు మిరియములు కరకపిందెలు వాయువిళంగములు తెగడ వస దీనిని చూర్ణముచేసి జెముడుపాలచే నాలుగైదుపర్యాయములు భావనచేసి అనుపానయుక్తముగ సేవించిన

యెడల ఉదావర్తము కడుపు బల్లలు ఉదరరోగములు నివారణమగును.

ఉదావర్తమునకు హింగ్వాదిచూర్ణము.

ఇంగువ బిడాలవణము వస జలకర్ర శొంఠి కరక పుష్కరమూలము చెంగల్వకోష్టు వీనిని క్రమముగ గ్రహించి చూర్ణించి సేవించినయెడల గుల్మోదరము అనాహము విషూచిక మొదలగునవి నివారణమగును.

ఊరుస్తంభ చికిత్స.

జీడిగింజలు మోడి పిప్పళ్ళుచేర్చి కషాయముగాచి తేనెగలిపి సేవించినయెడలను పిప్పలిచూర్ణమును గోమూత్రముతో పుచ్చుకొనిననూ ఊరుస్తంభవాయువులు నివారణమగును.

ఎక్కిళ్ళకు చికిత్స.

చక్కగా ముదిరిన కూశ్మాండములోని గింజలనుదెచ్చి ఆముదపు దీపమునగాల్చి ఆకాలినబీజములపొడిని తమలపాకులోనుంచి భుజించిన యెడల ఎక్కిళ్ళుమానును.

నెమిలికన్నులభస్మము యష్టిమధుకము తుమ్మెదగూడు సగ్గొలిమి ఉత్తరేణివిత్తులు పీతకలుగులోనినీళ్లు చూర్ణించి తేనె ననుపానముగా బెట్టి యిచ్చినయెడల ఎక్కిళ్లు మానును.

ఓజఃక్షయ లక్షణము.

కోపము ఆకలి చింత శోకము శ్రమము వీనిచేతను రూక్ష పదార్థములు ఉష్ణపదార్థములు చేదుపదార్థములు వీనిని భుజించుచుచేతను మిగుల కృశింపజేసెడి పదార్థములు భుజించుటచేతను ఓజస్సు క్షయించును ఇటుల నోజస్సుక్షయించిన వానికి పలుమారు భయము దౌర్బల్యము చింత ఇంద్రియములయందు వ్యధ కాంతివిహీనత్వము వైమనస్యము రూక్షశరీరము నల్లబారియుండుట ఇట్టి లక్షణములు గలిగి యుండును.

## ఓజో వృద్ధి లక్షణము.

మానవుని యొక్క శరీరమునందుండెడి శుక్రోపధాతువగు ఓజస్సు కోమలములును రుచికరములును ఇంద్రియపుష్టికరములునగు పదార్థముల యొక్క ఆహారములచేతను మఱియు పాలు మాంసరసము వీనిని భుజించుటచేతను విశేషముగ వృద్ధిజెందును.

## ఔషధము నియ్యకుండుటవలన వైద్యునికి గలుగుదోషము.

ఏవైద్యుడు మార్గమందు తీవ్రరోగముచే గ్రస్తుడైన బ్రాహ్మణునిగాని ఆవునుగాని చూచి చికిత్సచేయక విడచిపెట్టినయెడల ఆతడు బ్రహ్మహత్యాదుల జేసినంతటి పాపమును బొందును.

## ఔ ష ధ సే వ న కా ల ము.

ఎక్కడ నౌషధసేవనకాలము చెప్పలేదో అక్కడ ప్రాతఃకాలమునందు ఔషధమును సేవించవలెను.

## ఔ ష ధ ప్ర తి ని ధి.

కషాయములు చూర్ణాదులు వీనియందు లేక ఏప్రయోగమునందైననూ నౌషధముదొరకని పక్షమున నాయౌషధమునకు సమానధర్మము గల వస్తువులను చేర్చుకొనవలయును. అతివసలభింపనియెడల తుంగముస్తలు ఆమ్లవేతసము దొరకనియెడల చుక్కకూర కస్తూరి దొరకనియెడల సెనగపులుసు లేక జాపత్రి మొదలగునవి వాడుకొనవచ్చును.

## ఔ ష ధ ప్ర మా ణ ము.

కషాయము చూర్ణము లేహ్యము మొదలగువానియందు భాగము వివరింపని పక్షమున అక్కడ అన్నిపదార్థములకు సమభాగము.

## కం ఠ కు బ్జ స న్ని పా త ము.

కంఠకుబ్జసన్నిపాతముగలవాడతిదాహముగలిగియుండును తల తిరుగుచుండును ఒడలంతయు విరుగగొట్టినటులుండును మూర్ఛ ఎక్కిళ్లు వచ్చును వాంతులగును దగ్గుచే బాధపడును శ్లేష్మమతిశయించును కంఠమునందు గద్గదస్వరమేర్పడును శిరోవేదన అపరిమితముగనుండును ఇతండు బ్రతుకుట దుర్లభము.

## కర్ణికసన్నిపాతము.

కర్ణికసన్నిపాతముగలవాని నాలుక పగిలియుండును దగ్గుచుండును ఎక్కిళ్ళువచ్చును కర్ణాగ్రములు వాచును శరీరము వడకుచుండును మాటిమాటికి పరుండిన స్థలమునుండి లేచిపోవ ప్రయత్నించును. ఎల్లప్పుడు కల్లలాడుచుండును.

## కోపముచేవచ్చిన జ్వరము.

ఎక్కువ కోపమువలన జ్వరముగలవాని శరీరము వడకుచుండును ఎక్కువ భీతిల్లును పట్టును లేకలు వేయుచుండును గుండెలదురుచుండును.

## కువైద్య లక్షణము.

వ్యాధియొక్క పక్వాపక్వముల నెరింగినవాడే వైద్యుడు అట్టుల తెలిసికొనుటకు జ్ఞానములేక వైద్యులమను నామము వహించెడి వారిని వైద్యచోరులుగా దెలియవలెను.

## కఫప్రకోపమాసములు.

ఫాల్గుణము, చైత్రము, ఈ రెండుమాసములయందు జంతుపీడ కలుగును మఱియు నీరెండుమాసములయందు శీతలాంబు సంబంధముచే సముద్భూతమైన శ్లేష్మధాతువు ప్రకుపితమని చికిత్సజ్ఞులు చెప్పియున్నారు.

## కాలభేదమునందు వాతాదివ్యాప్తి.

శ్లేష్మము పగలు పూర్వాహ్ణమందు ప్రదోషకాలమందును ప్రబలముగనుండును. పిత్తము మధ్యాహ్నమందు అర్ధరాత్రమునందు నెక్కువగానుండును వాయువు అపరాహ్ణ కాలమునందు అర్ధరాత్రాత్పరమందున నెక్కువగానుండును.

## కఫప్రకోపకారణము.

గురువుగను, గట్టిగను, మధురముగను, పులుసుగను, మృదువు

గను పదార్థములచేతను మినుములు నువ్వులు, ద్రవయుక్తపదార్థములు పెరుగు వీనిచేతను పగటియందు నిద్రపోవుటవలనను చల్లనివస్తువులు భుజించుటచేతను నిశ్చేష్టుడుగనుండుటచేతను దివసముయొక్క ప్రథమ భాగము రాత్రియొక్క మొదటిభాగము భోజనోత్తర కాలమునందును శ్లేష్మముజనించును.

పగటియందు నిద్రయు మధురపదార్థము శీతలపదార్థము మత్స్య మాంసము గురుపదార్థము పులుసుపదార్థము, జిగటపదార్థము నువ్వులు చెఱకు పెరుగు నెయ్యి మజ్జిగ మృదుపదార్థములు తృప్తికరమైన పదార్థములు భక్ష్యములు ఉదకపానము వసంతఋతువు మొదలగునవి కఫప్రకోపము గలుగజేయును.

## కఫచర్య.

శరీరము తెలుపుబారియుండుట చల్లగనుండుట బరువుగనుండుట నవగలుగుట శరీరముజిగటగనుండుట బద్ధకించియుండుట లేపత్వము వాపు కలుగుట పనియందు సావకాశము గలుగుట మొదలగునవి కఫచర్యలని రెఱుగవలెను.

## కఫవృద్ధి.

కఫము వృద్ధిజెందినపుడు మలము మూత్రము నేత్రములు దేహము మొదలగునవి తెలుపు బారియుండుట శైత్యగుణము కలుగుట దేహము బరువుగనుండుట అతిశయముగా నిద్రగలుగుట సంధిశైథిల్యము భేదము నోటియందు నీరూరుట మొదలగునవిబుట్టును.

## కామజ్వరచికిత్స.

శరీరమునకు శ్రీగంధలేపనమును ముత్యాలహార ధారణమును జేసి కొని రసికులగు శృంగారభరిత సంభాషణము సేయునారుగ రూపలావణ్య సంపన్నులుగనుండు స్త్రీలను కౌగిలించుకొనుటవలన కామజ్వరము శమించును. మనోహరములైన చిగుళ్ళయందుగాని తామరరేకులందు గాని నిద్రించుటవలనను ప్రియులైన మిత్రులలో స్నేహము చేయుట వలనను పుష్పించినతోటలలో దిరుగుటవలనను బావి చెఱువు మొదలగు

వాని గట్టుననిలుచుటవలనను, చిలుకలు, తుమ్మెదలు, కోయిలలు, మొదలగువాని యొక్క మధురస్వరము వినుటచేతను, ప్రియురాలితో సంభాషించుటవలనను, స్వచ్ఛమగు వట్టివేళ్ళ విసనకర్ర గాలివలనను, కామజ్వరము శమించును.

శ్రీగంధము, పచ్చకర్పూరము, మంచు, వట్టివేళ్ళు, శరీరమునకు పూసికొనిన జ్వరము శమించును. కామజ్వరపీడితులకు, ప్రియురాలి అధరచుంబనమే కషాయము. ప్రియురాలియొక్క దృఢాలింగనమే పథ్యంబుగా దెలియవలెను.

## క్రిమి చికిత్స.

చంద్రచెక్క, కొడిసెచెక్క, వేపచెక్క, వస, తెగడ, శొంఠి, పిప్పలి, మిరియములు, కరకపిందెలు, ఉసిరికపొలుపు, తాడికాయలు, మొదలగువానిని చూర్ణించి గోమూత్రమున కలిపి కషాయముగాచి యేడుదినములు సేవించినను, వాయువిడంగమును చూర్ణించి తేనెతో గలిపి భుజించినను క్రిమిరోగములు మానును.

## కాసశ్వాస చికిత్స.

గంటుబారంగి, కాయఫలము, సీమనేలవేము, వట్టివేళ్ళు, తుంగముస్తెలు, ధనియాలు, కరకపువ్వు, వస, పర్పాటకము, కరకపిందెలు, శొంఠి, దేవదారుచెక్క, వీనిని కషాయముపెట్టి, వేయించిన యింగువ గలిపి, తేనెవేసి పుచ్చుకొనినయెడల, జ్వరము, దగ్గు, శ్వాస, కఫరోగము, నోటిదుర్గంధము, కంఠరోగములు, వాతరోగములు నివారణమగును.

## కాస చికిత్స.

రావిచెట్టుబంక, అతిమధురము, తామరగింజలు, పిప్పళ్ళు, చిన్నములకపండ్లు, మొదలగువానిని చూర్ణముచేసి తేనెకలిపి సేవించినయెడల క్షయసంబంధమైన దగ్గులు మానును.

## కాసశ్వాసలకు మరీచ్యాదిఘృతము.

మిరియములపొడిలో పంచదారకలిపి తేనెతో సేవించినయెడల కాసశ్వాసలు మానును.

## కాసశ్వాసలకు మాత్రలు.

ఒకభాగము పాదరసము, రెండుభాగములు గంధకము, మూడు భాగములు పిప్పళ్ళు, ఆఱుభాగములు అడ్డసరపాకు, ఏడుభాగములు గంటుభారంగి చూర్ణముచేసి తుమ్మచెక్క కషాయము పైచూర్ణములో గలిపి ఖల్వములోనుంచి చక్కగా మర్దించి గురిగింజప్రమాణము మాత్రలుచేసి అనుపానయుక్తముగా సేవించినయెడల కాస శ్వాసలు నివర్తించును.

## కంటకాద్యఘృతము.

పల్లేరు, ఆముదపువేరు, కుశము, కాశము, దర్భ, శరము, మహాశతావరి, దోస, చెఱుకు వీనిరసములలో అర్ధాంశము నెయ్యి, బెల్లము చేర్చి, ఘృతపక్వముగ కాచి సేవించిన మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, మూత్రాఘాతము, మొదలగునవి నివారణమగును.

## కుష్ఠచికిత్స.

శుద్ధిచేసిన గంధకమును చూర్ణించి ఆవుపాలతో పుచ్చుకొనిన కుష్ఠము నివారణమగును. శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిచేసిన తాళకము, మిరియాలు, పసుపు, మ్రానుపసుపు, సింధూరము మైలతుత్థము, తగిరిసెవిత్తులు, బావంచవిత్తులు, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ వీనిని చూర్ణముచేసి, ఇనుపపాత్రలోనుంచి, నిమ్మపండ్లరసముగలిపి, ఇనుములో నొకజాముమర్దించి నేతితోకలిపి, శరీరమునకు లేపనముచేసిన, దురద, గజ్జి, యివిమానును. గంటెనవేరునీళ్ళతోనూరి శరీరమునకుబూసిన శ్వేతకుష్ఠ మొకనెలలోపల నివర్తించును.

## కాసమర్దాది లేపము.

తీటకసింద వేరును, కాంజికములోనూరి, లేపనముచేసిన దద్రుకిటిభకుష్ఠములు నివర్తించును.

## కర్ణరోగ చికిత్స.

చచ్చినతేలును నూనెలోవేసికాచి, ఆనూనెను చెవులలో పోసుకొనిన కర్ణరోగములు మానును.

## కనకసుందరరసము.

కృష్ణధుత్తూర బీజములు, నాభి, ఇంగిలీకము, గంధకము, మిరియములు, పిప్పళ్ళు, వెలిగారము, వీటిని చక్కఁగా శాస్త్రరీతిగ శుద్ధిచేసి ఖల్వములోనుంచి గంజాయి కళ్ళనీళ్ళలోనొక జాముమర్దించి, అల్లపు రసమున నొకజామును మర్దించవలెను. తదుపరి యానూరిన యౌషధమును ఛాయాశుష్కమొనరించి సెనగగింజలంతమాత్రలుచేసి యీమాత్రలను గూడ ఛాయాశుష్కమొనర్చి, భాగఘృతము ననుపానముగాబెట్టి, పూటకు ఒకమాత్రచొప్పున ప్రాతఃకాలమునను, సాయంకాలమునను, నొసంగినచో, సర్వజ్వరములు నివారించును. అతిసారము లుపశమిల్లును. ఈయౌషధమును, నల్లతుమ్మచెక్కగాని, ఆకుగాని, కషాయముపెట్టి యనుపానముగా నివ్వవచ్చును.

## కస్తూరిమాత్రలు.

ఒకవరహాయెత్తు కస్తూరి, ఒకవరహాయెత్తు కర్పూరము, ఒకవరహా ఎత్తు పచ్చకర్పూరము, ఒక వరహాయెత్తు మిరియములు 1 వ॥ యెత్తు యాలకులు 1 వరహా యెత్తు జాపత్రి 1 వరహా యెత్తు గోరోజనము 1 వరహా యెత్తు లోకమిరియములు 1 వరహా యెత్తు కుంకుమపువ్వు 1 వ॥ యెత్తు జాజికాయ, 1 వ॥ యెత్తు లవంగములు, 1 వ యెత్తు పిప్పళ్ళు మొదలుగాగల దినుసులను లవంగముల కషాయములో మర్దించి,

పెసరగింజలంత మాత్రలు జేసి ఛాయాశుష్కమొనర్చి సీసాలలో నుంచు కొనవలయును. చంటిబిడ్డలకు చనుబాలతో నొకటి రెండుమాత్ర నివ్వ వలెను జ్వరాదులు నివారణమగును.

### కుక్కుటాండభస్మము.

పిల్లలయిన తరువాత నుండెడి కుక్కుటాండముల చిప్పలను దెచ్చి యందులోని పొరలుదీసి, చక్కగా పొడిచేసి, ఆచూర్ణము మూడుభాగములును, నొకభాగము శుద్ధిజేసిన యింగిలీకము జేసి, తమలపాకురసమున మర్దించి గుటికలు చేయవలయును. అటుపిమ్మట, యిరువదైదు ఆవు పేడ పిడకలదెచ్చి పైగుటికలను పుటముబెట్టి చక్కగా భస్మమైన పిమ్మట నిమ్మపండ్లరసమును మిశ్రితముజేసి సూర్యపుటము చేయవలెను. అనుపానభేదములతో చంటిబిడ్డల కొసంగినయెడల సర్వజ్వరములు, దగ్గు, కఫము మొదలగునవి నివర్తించును.

### కడుపులోని బల్లలకు.

తెల్లగలిజేరు మొక్కను సమూలముగా గొనివచ్చి నీడయందు యెండించి, పొడిచేసి, ఆపొడికి, మేకపాలు సింధులవణముగలిపి, గోఘృతముగలిపి, పక్వముజేసి, నాల్గుదినములు భుజించినయెడల కడుపులోని బల్లలు కరగిపోవును. ఈ యౌషధము సేవించుదినములలో చప్పిడి పథ్యముండవలెను. విరేచనములగును.

### క్రిమిరోగము.

క్రిమిరోగముచే పీడింపబడువానికి జ్వరమువచ్చును. వమనములగును భ్రమము, అన్నహితవులేకయుండుట, గలిగియుండును. అతిసారమును యుండును. ఈవ్యాధిగలవారు మాంసము భుజింపరాదు. నెయ్యి, పాలు, పులుసు, తీపి మొదలగునవి దినుటయందెక్కువ యిష్టపడును.

### క్రిమిహరచూర్ణము.

వేపచిగుళ్ళు ఓమము చక్కగా తేనెతోగలిపి భుజించినయెడల

క్రిమిరోగములు నివర్తించును.

## కలరాకు చికిత్స.

కోడియొక్క పొట్టనిమలమును దీసికొనివచ్చి గురిగింజప్రమాణము నొకతమలపాకునకుబూసి, పైన నొకతమలపాకుచుట్టి బాగుగా నమిలి మ్రింగవలెను. ఈవిధి రెండు మూడు మారులు సేవించినయెడల కలరా నివారణమగును.

ఈ చిటుకా నతిగోప్యమైనదిగా నెంచుంగవలెను. వ్యాధిగ్రస్తునకు చూపరాదు.

అల్లపురసము నొకసేరుదీసి, గాజుపాత్రిలో నుంచినయెడల నొక గంటసేపైనపిమ్మట ఆపాత్రి అడుగుభాగమున మడ్డిజేరును. పైనీటిని పారబోసి యామడ్డిని నీడలో నెండబెట్టినయెడల సున్నమగును. ఈసున్నము మూడుపలములంత దీసికొని తులము రసకర్పూరముగలిపి అల్లపు రసములో చక్కగామర్దించి కందిగింజంత మాత్రలుజేసి ఛాయాశుష్కమొనర్చి కలరా వ్యాధిగ్రస్తునకు గంటకొక మాత్రచొప్పున నొసంగిన యెడల కలరా నివర్తించును. వ్యాధికట్టినపిమ్మట నౌషధము నొసంగరాదు.

## కలకలకు చికిత్స.

కండ్లకలకలైనయెడల గంజాయిఆకును కషాయముబెట్టి ఒకటి రెండుచుక్కలు కండ్లలో వేసినయెడల నివర్తించును.

వెలిగారము, ముసాంబరము, పటిక, సల్లమందు, సమభాగముగా జేర్చి నిమ్మపండ్లరసముతో మర్దించి కండ్లచుట్టును పట్టువేయవలెను. రెండుమూడు పర్యాయము లీవిధి జేసినయెడల కండ్లకలకలు నివర్తించును.

## కంటిపొరకు, ఎఱుపులకు.

నాలుగుపసుపుకొమ్ములను దీసికొనివచ్చి చక్కగా పండిన నిమ్మపండ్లరసమునుదీసి యారసములో పైపసుపుకొమ్ములను పదిదినములవరకు

నుంచేది. నీడలో నెండినపిమ్మట భద్రపరచుకొని యుంచవలసినది కంటి పొరలుగాని ఎరుపులుగాని వచ్చినయెడల నీటితోనూరి కల్కమువేసు కొన్నచో నివర్తించును.

## కంటిపొరలకు.

ములగాకురసములో తేనె సమభాగముగాజేర్చి మర్దించి కండ్లకు కల్కము వేసికొనినయెడల కంటిపొరలు మానును.

## కండ్లలో పువ్వులకు.

గోఘృతమున తెల్లగలిజేరు నరుగదీసి కల్కమువేసికొనిన కండ్ల లోని పువ్వులు మానును. ఆవుపంచితమున ఈశ్వరివేరు నరుగదీసి కల్కము వేసుకొనినను కండ్లలోని పువ్వులుమానును.

## కన్నువాపులకు.

నల్లతుమ్మచెక్కను అరగదీసి ఆగంధమును కొంచెము వేడియగు నటుల శెగనుంచి కండ్లచుట్టును పట్టువేసుకొనవలెను.

## ఖండార్ద్రక లేహ్యము.

ఆర్ద్రము 20 పలములుదెచ్చి యించుపగింజలంత ప్రమాణముగల శకలములజేసి గోఘృతము 8 పలములు చక్కర 2 1/4 శేరుదెచ్చి పాకు బట్టి తాలిశపత్రి దాల్చినచెక్క ఆకుపత్రి కరక్కాయలు లవంగాలు యాలకులు తాడికాయలు గంటుబారంగి తుంగముస్తెలు కటుకరోహిణి ఉసిరికపప్పు తవాక్షీరి మంచిగంధము నాగకేసరములు నల్లజీలకర్ర వట్టి వేళ్ళు చెంగల్వకోష్టు జాజికాయలు చవ్యము యష్టిమధుకము, శొంఠి పిప్పళ్ళు మిరియములు వాయువిళంగములు మొదలగు దినుసులను ప్రత్యే కము 10 చిన్నములు పొడిచేసి ఈచూర్ణమును పైఆర్ద్రపు శకలములను పై చక్కరపాకులోగలిపి కొంచెము పక్వమైనపిమ్మట కొంచెము గోఘృ తము తేనెగలిపి లేహ్యపాకమునకు వచ్చునటుల పక్వముచేసి సాంగ శీతలమగునటులొనర్చి యొకగాజు సీసాలో నుంచుకొని ప్రతిదినమును నైదుచిన్నములయెత్తు లేహ్యము భుజించినయెడల సమస్త అజీర్ణములు, పైత్యములు, మందాగ్ని, క్షయ, పాండువు, మొదలుగాగల సమస్తవ్యా ధులు నివారణమగును.

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

ఆయుర్వేద

# వైద్యసారామృతము

(మూడవప్రకరణము)

## గుడూచీతైలము.

తిప్పతీఁగె కషాయముగాని లేక కల్కముగాని దీసికొని, దానిలో తైలము, లక్కరసము, యష్టిమధుకము, నేలగుమ్మడురసము, జేర్చి, తైలము బాగుగాకాచి, తలంటుకొని స్నానముచేసినయెడల వాతరక్తము నివారణమగును.

## గుల్మప్లీహాదిచికిత్స.

యవక్షారము, సైంధవలవణము, ఓమము, అమ్లవేతసము. కరక్కాయ వొలుపు, వస, వేయించిన హింగు, చూర్ణముచేసి, వేడినీటితో ఏడుదినములు సేవించినయెడల వాయువులచేత కడుపులో బుట్టిన పోటు గలబిల్లలు ఉదరవ్యాధులు నివర్తించును.

## గుల్మమునకు నారాచరసము.

శుద్ధిచేసిన గంధకము శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన నేపాళములు త్రిఫలములు త్రికటుకములు వీనిని సమముగచేర్చి తేనెతో మర్దించి నిష్కప్రమాణము సేవించిన గుల్మోదరము నివారణమగును.

## గోక్షురాదికషాయము.

పల్లేరు సమూలము కషాయముపెట్టి పంచదార తేనెజేర్చి సేవించిన మూత్రకృచ్ఛము ఉష్ణవాయువు నివర్తించును.

## గుడూచీధాత్రీరసయోగము.

తిప్పతీగె రసములో తేనెజేర్చి సేవించినను లేక ఉసిరిక రసములో పసుపుపొడి తేనెజేర్చి పుచ్చుకొనినను సర్వప్రమేహములు నివర్తించును.

## గండమాల చికిత్స.

దేవకాంచనపు చెట్టుయొక్క పట్టను కషాయముపెట్టి అందులో శొంఠిచూర్ణము చేర్చి సేవించినయెడల గండమాలలు నివర్తించు.

తెల్లగంజెనవేరు, వెఱ్ఱిపుచ్చవేరు, వస, గోమూత్రముతో నూరి లేపనముచేసినఉపద్రవయుక్తములగు గండమాలలు నివర్తించును.

జీడిగింజలు అన్నభేది ఉత్రేణిమూలము దంతివేళ్ళు బెల్లము వాయువిళంగములు సమభాగములుగ జిల్లేడుపాలతో మర్దించి గండమాలకు లేపనము చేయుచుండిన వాయువుచే మేఘపంక్తి తొలగురీతిగ గండమాల తొలగును.

## గండభేరుండరసము.

ఇంగిలీకము నాల్గుభాగములు, నాభి రెండుభాగములు, కటుకరోహిణి తొమ్మిదిభాగములు దీసికొనివచ్చి నుంచినీటిలోనూరి గురిగింజలంత మాత్రలుజేసి చన్నీటిలో సేవించినయెడల శీతజ్వరములు నిస్సందేహముగ నివర్తించును.

## గండభేరుండరసము. (మరియొకటి)

పాదరసమొకభాగము, అభ్రకభస్మ మొకభాగము, లోహభస్మ మొకభాగము, తామ్రభస్మ మొకభాగము, గంధక మొకభాగము, మైలతుత్థ మొకభాగము, పాలతుత్థ మొకభాగము, ఉల్లిపాషాణ మొకభాగము, గరళ మొకభాగము తాళక మొకభాగము, నాభి యొకభాగము దీసికొనివచ్చి చిన్నెరుగడ్డ రసములో నైదుదినములునూరి తమపరి నిమ్మపండ్లరసముతో సప్తజాములుమర్దించి మినపగింజంత మాత్రలుగట్టి

అనుపానభేదములతో నొసంగినయెడల త్రయోదశసన్నిపాతములు సమస్తదోషములు పురాణజ్వరములు అస్థిగత జ్వరములు నివారించును,

## గ్రహణిరోగము.

వ్యాధిచే పీడింపబడుచుండి యౌషధ సేవనకాలమున నపథ్యము చేసినయెడల నగ్నిమాంద్యము సంభవించి గ్రహణివచ్చును. తిన్న అన్న మరుగకపోవుటయు దానివలన మలము నెత్తురుతో మిశ్రితమై గాని చీముతోగలిసిగాని లేక రక్తచీములతోగలసిగాని పడుటయు, మలము వచ్చుసమయమునగుదస్థానమున బాధగాని మలమువచ్చి రాకయుండుటయు చెడ్డవాసనతో మలమువచ్చుటయు శక్తిజాలకయుండుటయు అతిదాహము నిస్త్రాణ కాళ్లుచేతులు నొచ్చుటయు గలిగియుండును

## గ్రహణికౌషధము.

మారేడుపండుయొక్క గుజ్జు, చిత్రమూలము, శొంఠి, పొడిజేసి, మజ్జిగలో గలిపి పుచ్చుకొనినయెడల గ్రహణి నివర్తించును.

రసము, గంధకము సమభాగములుగా జేర్చి ఖల్వమునసుంచి, నిమ్మపండ్లరసముతో చక్కగా మర్దించి కర్షప్రమాణముగల మాత్రలుచేసి మిరియముల చూర్ణముతోను, నేతితోను పుచ్చుకొనినయెడల నివర్తించును,

## గ్రహణికవాటము.

నల్లమందు, బూరుగబంక, జాజికాయ, నల్లఉమ్మెత్తవిత్తనములు వెలిగారము, తుంగముస్తెలు, అతివస, అంకోలపు విత్తులు, విరజాజి పువ్వు, మారేడు, మోదులు, శొంఠి, మామిడిటెంకె, మొదలగునవి సమభాగములుగా దీసికొని ఖల్వమున గంజాయి ఆకురసమున మూడు జాములపాటు రాత్రములు మర్దించి, కర్షప్రమాణపు మాత్రలుజేసి, కదళీ పుష్పరసములోగాని, తేనెతోగాని యిచ్చినయెడల గ్రహిణి నివర్తించును. ఈగొప్పయౌషధమునే గ్రహణి కవాటమందురు.

మామిడిటెంకలోనిపప్పు, కరక్కాయలపొడి, దానిమ్మకాయ బెరడు నెండబెట్టి దంచిన చూర్ణము, నల్లమందు, జాజికాయ, కొడిశపాల, నాభి, వాటవేరు, చింతగింజపైబెరడు, మొదలగునవి సమభాగములుగా చేర్చి చూర్ణించి కరక్కాయలపొడి ఎంతయెత్తు తూనికయగునో అంతయెత్తు మారేడుచెక్క రసముచేర్చి యెండబెట్టి భద్రముగా నొక గాజుసీసాలో దాచి మరిడీగ్రహణి జాడ్యములకు తత్వమెరిగి తేనె గోఘృతము, బఱ్ఱెపెరుగు శుద్ధోదకము మొదలగువాని ననుపానముగా బెట్టి వ్యాధిగ్రస్తునియొక్క బలాబలంబులెరింగి యౌషధమొసంగిన యెడల మరిడీగ్రహణి నిస్సందేహముగ నివర్తించును. కందికట్టువారు పథ్యము. మంచినీళ్ళు త్రాగుట కివ్వగూడదు. నోరెండినయెడల లవంగములు పిప్పళ్ళుదంచి కషాయముబెట్టి యది యివ్వవలెను. వ్యాధి గ్రస్తుడు స్వస్థుడగువరకు అన్నము బెట్టరాదు.

## గుల్మోదర రోగములు.

వాత పిత్తశ్లేష్మము లతిశయించినయెడల పంచవిధములైన గుల్మము లుద్భవ మొందును. ప్రేగులనుము గ్రంథివలెనుండును. గుల్మరోగికి మలమూత్రములు స్వేచ్ఛగా రానేరవు అన్నహితవుండదు. కడుపుబ్బును గర్భమునందు గుబ్బువలె యెలుచుచుండును. అగ్నిమాంద్యము ఊర్ధ్వ వాతము గల్గును గర్భస్రావ మయినపుడు ఋతుకాలమున దాహశూలలతో రక్తగుల్మము బుట్టినయెడల గర్భిణీ గర్భమువలె నుదరముండును.

## గ్రహణికి

రెండు ఖర్జూరఫలములు లవంగములు ఎనిమిదితులములు, జాజికాయలు ఎనిమిది తులములు, దాల్చినిచెక్క యెనిమిదితులములు, పది చిన్నముల ప్రమాణము రససిందూరము ఆరుచిన్నముల ప్రమాణము నల్లమందు మొదలగు వస్తువులను గోధుమపిండిలో పొదిగి అగ్నిపుటము పుటమువేసి సాంగశీతలమైన పిమ్మట మర్దనచేసి వ్యాధిగ్రస్తున కొసంగిన యెడల గ్రహణి నివర్తించును. ఆవుమజ్జిగ కందికట్టు పథ్యము.

## గసాలమైనము.

గసాలను మైనమువలె మర్దనచేసినయెడల మైనము అగును. దీనిని రక్తగ్రహణిగల రోగికిచ్చినయెడల వ్యాధి నివారణమగును.

## ఛాయాపురుషలక్షణము.

ఈఛాయాపురుషలక్షణము నెరింగినయెడల మానవుడు దివ్యజ్ఞానియగుటకు సందియములేదు. కాలముదూరముగానుండినను ఏయుపాయమువలన దెలిసికొనవచ్చునో ఆయుపాయము శివాగమమందు సంక్షేపముగ యెటులజెప్పబడియున్నదో అటులనే చెప్పెదను.

మనుష్యసంచారము లేనటువంటి ఏకాంతస్థలమునకు వెళ్ళి, తన పృష్ఠభాగమున సూర్యుడుండునట్లు కూర్చుండి తననీడలో కంఠదేశమందు ఏకాగ్రదృష్టిచే చూచుచు ధ్యానింపవలయును. తర్వాత కొంతకాలము ఛాయతట్టుచూచి ధ్యానించిన పిమ్మట ఆకాశమువంకజూచిన గుహాదృష్టికి గోచరమగును. అనంతరము 'ఓంహ్రీంపరబ్రహ్మణేనమః' అను మంత్రమును 108 మార్లు జపించిన శంకరుని జూడవచ్చును.

శుద్ధస్ఫటికమువంటి తేజస్సుతో జ్వలింపుచు నానారూపములను ధరించియున్న సాంబమూర్తిని నాలుమాసంబులు ధ్యానంబుజేసిన యెడల ప్రాణులకు పతియగును.

ముందుజెప్పినటుల రెండుసంవత్సరములు అభ్యసించిన యెడల తనంతట సంహరించువాడుగను రక్షించువాడుగను, కాలత్రయమును దెలిసినవాడునునై ఆనందము పొందియుండును.

ఏమనుష్యుడు నిరంతరము ఇట్టియోగాభ్యాసము చేయుటచే వానికి త్రైలోక్యమందేదియు దుర్లభముండదు మఱియు అస్వచ్ఛాకాశమందు ఛాయాపురుషశరీరము కృష్ణవర్ణముగ కనుబడినయెడల నాలుమాసములకు మరణించును.

ఛాయాపురుడు పసుపువర్ణముగ కనుబడెనేని రోగభయమనియు, రక్తవర్ణముగ లేక నీలవర్ణముగ కనుబడిన యెడల మృత్యువును, నానావిధములైన వర్ణములుగా కనుబడినయెడ్ల చిత్తమునకు మిక్కిలి యుద్వేగమును కలుగును.

ఏమానవుని యొక్క దృష్టికి ఛాయాపురుషునికి పాదములు మోకాళ్ళు కడుపు కనుపడకపోవునో, ఆ మానవుడు ఆఱునెలలకును సంవత్సరమునకును రెండుసంవత్సరములకును క్రమముగ మరణించును.

ఛాయాపురుషుని కుడిభుజము, ఎవనికి కనుబడకపోవునో, అట్టి వానికి బంధువు మరణించును. ఎడమభుజము ఎవనికి కనబడకపోవునో వానిభార్య మరణించును ఇందుకు సందియములేదు.

ఎవనికి ఛాయాపురుషునియొక్క శిరస్సు కుడిభుజము, కనుపడ లేదో ఆపురుషుడు ఆసన్నమృత్యువును జెందువాడని తెలియంగవలెను తలకనుపడక పోయిన నొకమాసమునకు మరణించును. పిక్కలుకనుపడక పోయిన నొకదినములోపల మరణించును మెడలేనట్లు కనుపడినయెడల ఎనిమిదిరోజులలో మరణించును, సర్వాంగముయొక్క ఛాయయే కనుబడనియెడల తత్క్షణమే మరణించును.

## చికిత్సాద్యుపదేశము.

శ్లో॥ జాతమాత్రశ్చికిత్స్యస్స్యా న్నోపేక్ష్యోఽల్పతయాగదః ।
వహ్నిశత్రువిషైస్తుల్య స్స్వల్పోపివికరోత్యసౌ॥

వ్యాధి జన్మించినతోడనే చికిత్సచేయవలెను ఆవ్యాధిస్వల్పముగా నుండినను ఉపేక్షచేయరాదు. ఉపేక్ష చేసినయెడల నది అగ్ని, శత్రువు, విషము, మొదలగువానితో సమానముగాన వికారము జనింపజేయును.

## చికిత్సాఫలము.

వైద్యునికి చికిత్సవలన ధనము, స్నేహము, ధర్మము, యశము మఱియు కర్మాభ్యాసము గలుగునుగాక చికిత్స నిష్ఫలముగానేరదు.

ఏరోగి మిగుల శ్రద్ధగలవాడై ఆయుర్వేదమందు జెప్పబడినచికిత్స చేయుచున్నాడో, ఆరోగి శ్రేయస్సు, ఆయుర్వృద్ధి నిరోగత్వము వీనిని బొందును.

లోభముచే చికిత్సచేయుటవలన గలిగెడి పుణ్యము నశించును గాన వైద్యుడు చికిత్సా విషయమై ద్రవ్యమునపేక్షింపరాదు అయినను జీవనార్థమై మిగుల ధనవంతులయొద్ద ధనమార్జింపవచ్చును.

## చికిత్సాంగములు.

చికిత్సకు రోగి దాత వైద్యుడు దీర్ఘాయువు ద్రవ్యము మంచి సేవకుడు ఉత్తమౌషధము ఇట్టి యంగములు కలిగియుండవలెను.

రోగముగలవాడు రోగియనబడును. కాన నెట్టిరోగికి చికిత్సచేయ వలసినదియు ఎట్టిరోగికి చికిత్స చేయఁగూడదనియు వైద్యుడెరుంగవలెను.

## చికిత్స జేయదగనివారు.

దుష్టుఁడు, సాహసికుఁడు, భీతుఁడు, కృతఘ్నుడు, వ్యాగుఁడు, శోకార్తుడు ఆసన్నమరణముగలవాఁడు, ఇంద్రియపటుత్వముగలవాఁడు, వైరము గలవాఁడు, స్వతః వైద్యాభిమానముగలవాఁడు, వైద్యునియందు విశ్వాసములేనివాడు శంకించువాడు వైద్యుని స్వాధీనములో నుండనివాడు లోనగువారికి చికిత్స చేయఁదగదు ఇట్టివారికి ఔషధమొసంగినయెడల వైద్యునికి దోషముగలుగును. మఱియు ఏరోగియొక్క గృహమందు వైద్యునికి మర్యాదలేదో ఆరోగికి సిద్ధిగలుగనేరదు.

వ్యాధి నిర్ణయమందు మంచిజ్ఞానము ఆవ్యాధియొక్క శమనోపాయము నెఱింగినవాడే వైద్యుడుగాన ఆయుఃవును గలుగజేయుట ప్రభువుగాఁడు.

## చిత్రకాదిఘృతము.

చిత్రమూలము, సైంధవలవణము, త్రికటుకములు, పెద్దయేలకులు, చవ్యము, దానిమ్మ, ఓమము, మోడి, జీలకర్ర, బోడతరము, ధనియాలు మొదలగువానిని సమభాగములుగజేర్చి కషాయముగాచి నెయ్యి పెరుగు కాంజికము బదరీమూలపురసము నేకముగజేర్చి ఘృతము మిగులువరకు కాచి సేవించినయెడల వాతగుల్మమగు గుడగుడ శబ్దముతో యుక్తమగు శూల ఇవి నివర్తించును.

## చిత్తవిభ్రమ సన్నిలక్షణము.

ఒడలునొప్పులు వాతమతిశయించుట ఉలికిపడుట పిచ్చివాని

వలెను కోపిష్టివలెను చూచుట కనుబొమ్మలు ముడుచుట గానముచేయుట ఆతడు ఎప్పుడు మాట్లాడుచుండుట మాట్లాడినమాటే మరల మాట్లాడుచుండుట మొదలగులక్షణములు రోగికి గలిగియున్న యెడల నది చిత్త విభ్రమ సన్నిలక్షణమని వైద్యుడెరుంగవలెను.

## చాతుర్థిక జ్వరచికిత్స.

తుంగముస్తెలు ఉసిరికకాయ తిప్పతీగ మొదలగు వస్తువులను దంచి కషాయముగాచి సేవించినయెడల చాతుర్థికజ్వరము నివర్తించును.

## చ లి జ్వ ర ము న కు చి కి త్స.

అక్షినిదెచ్చి కందిగింజయంతటి మాత్రజేసి అగ్నిశిఖరములో పొదిగి పూటకొకమాత్రసేవించిన యెడల మూడుపూటలలో చలిజ్వరము నివర్తించును గంజి చద్దిఅన్నము బాగుగా దినవలెను పథ్యము లేదు.

## చలిజ్వరములకు చికిత్సలు.

గుంటగలగర సమూలముగా దీసుకొనివచ్చి చక్కగదంచి నీటిలో వైచి కషాయముగాచి పిప్పళ్ళు అక్కలకర్రను దెచ్చి చూర్ణించి పైకషాయములో గలిపి సేవించినయెడల చలిజ్వరము నివర్తించును.

— శ్వేతార్క మూలపు బెరడుదెచ్చి పొడిచేసి అయిదుమిరియములు వేసి ఖల్వమునయుంచి శుద్ధోదకము గలిపి బాగుగా మర్దించి మాత్రలుజేసి పుచ్చుకొనినయెడల చలిజ్వరములు నివర్తించును.

శ్వేతార్కపు మొగ్గలు అయిదు మిరియములు తమలపాకులోబెట్టి నమిలి మ్రింగినయెడల జ్వరము నివర్తించును. ఇచ్ఛాపథ్యము.

వళాగ్రపువక్కలు తెల్లకవిరి పొడిచేసి మాత్రలుగట్టి జ్వరము వచ్చినపుడొకటి మరునాడొకటి సేవించినయెడల చలిజ్వరము నివర్తించును చప్పిడి పథ్యము.

## చిం తా మ ణి.

గంధకము దంతివిత్తులు తిప్పసత్తురసము మిరియములు వెలిగారము

మొదలగునవి సమభాగములుగా ఖల్వమునవేసి, నిమ్మపండ్లరసముతో చక్కగా మర్దించి గురిగింజలంత మాత్రలు జేసి, అనుపానభేదములతో సేవించవలెను.

చెవిపోటు చీముకారుట లోనగువానికి

మేకపోతు మూత్రములో, సైంధవలవణము కొంచెముకలిపి, వేడిజేసి చెవిలో బోసినయెడల, చెవిపోటు, చీముకారుట, మొదలగునవి నివర్తించును.

జిహ్వాపరీక్షాలక్షణము.

వాతప్రకోపమున ఎఱుపు నలుపువర్ణములు గలిగియుండును. శ్లేష్మప్రకోపమున తెల్లగను, బంకగలిగియుండును. సన్నిపాతమునందు, నలుపువర్ణముగలిగి, ముండ్లుగలిగి, ఎండియుండును. మిశ్రరోగమున మిశ్రమవర్ణము గలిగియుండును.

శ్లో॥ శాకపత్రప్రభారూక్షా స్ఫుటితారసనానిలాత్।
రక్తాశ్యామాభవేత్పిత్తాల్లిప్తార్ద్రాధవళాకఫాత్॥

శ్లో॥ పరిదగ్ధాఖరస్పర్శాకృష్ణా దోషత్రయేఽధికే।
సైవదోషద్వయాధిక్యే దోషద్వితయలక్షణా॥

వాతప్రకోపమున నాలుక పెరుగుతోటకూరయొక్క ఆకువలెను, కఠినముగను పగిలియు, పిత్తప్రకోపమునందు ఎఱుపు నలుపు వర్ణముగలిగి యుండును. శ్లేష్మప్రకోపమున ద్రవయుక్తమై శ్వేతవర్ణముగనుండును. దోషత్రయ ప్రకోపమున ద్రవములేకయు, కరకరగను, నల్లగనుండును. ద్విదోషప్రకోపమునందు రెండురంగులు గలిగియుండును.

జాంగలదేశలక్షణము.

శ్లో॥ జాంగలంవాతభూయిష్ఠ మనూపంతుకఫోల్బణమ్।
సాధారణం సమమలం త్రిధాభూదేశమాదిశేత్॥

జాంగలదేశము వాతప్రచురము, అనూపదేశము కఫప్రచురము, సాధారణదేశము సమమైన దోషములు గల్గియుండును.

## జ్వరపక్వప్రమాణము.

వాతజ్వరము 7 దినములకు పక్వమైవిడుచును. పైత్యజ్వరము 6 దినములకు పక్వమైవిడుచును. శ్లేష్మజ్వరము 9 దినములకు పక్వమై విడుచును. ద్వంద్వజ్వరము 10 దినములకు పక్వమైవిడుచును. ఈకాలమును అతిక్రమించిన జ్వరము విడువకుండిన పురాణ జ్వరములక్రింద చికిత్స చేయవలెను.

## జ్వరదినచర్య.

జ్వరము వచ్చినదినమందు లంఘనము చేయవలెను. రెండవదినము నందు దంతధావనము జేసికొని, నాలుక బాగుగా గీచుకొని, వేడి నీళ్ళతో పుక్కిలించి ఉమిసివైచి ముఖప్రక్షాళన మొనర్పవలెను. పిదప తలకు బట్టకట్టుకొని యెడమచెయ్యి క్రిందుగాబెట్టుకొని పరుండి ఆదినమంతయు లంఘనము చేయవలెను. మూడవదినము చాతుర్భాగావశేషముగా నీళ్లుకాచి త్రాగవలెను. ఆనీళ్ళలోని దోషము హరించుటకై ఒకచిల్లగింజను గంధముదీసి నీటిలో కలుపవలెను. నాల్గవదినమున గూడ నిటులే జేయవలెను అయిదవదినమందు గంజి త్రాగవలెను ఆఱవ దినమందుగూడ గంజిత్రాగవలెను ఏడవదినమందుగాని తొమ్మిదవ దినమందుగాని గంధూషము జేసుకొనినయెడల జ్వరము విడుచును లఘువైన పథ్యము చేయవలెను తదుపరి విరేచనములకు దీసుకొనవలెను.

## జిహ్వాకసన్నిపాత లక్షణము.

ఊర్ధ్వశ్వాసము తాపము దగ్గుగలుగుట నాలుకయందు తడిలేక ముల్లుదాకి నల్లబారియుండుట మాటాడకయుండుట చెవుడు జడత్వము గలుగుట మొదలగునవి జనించినయెడల జిహ్వాక సన్నిపాత లక్షణమని దెలియవలెను ఇది సాధ్యము.

## జ్వరహరచూర్ణము.

చిత్రమూలము ఉసిరికపాలువు సైంధవలవణము కరకపిందెలు

పిప్పళ్ళు, లోనగువాని చూర్ణించి సేవించినయెడల జ్వరములు హరించును. అరుచి మానును దీపనముగూడ గల్గును.

## జ్వ ర హ ర పా న ము .

నాల్గుపలముల నీళ్ళలో నొక పలము పాలుగలిపి అందులో మూడు పిప్పళ్ళువైచి, నీళ్ళుయిగురువరకుకాచి, పిప్పళ్ళనుదీసి, ఆపాలను సేవించినయెడల అగ్నిమాంద్యము, ఉబ్బసము, దగ్గు, కఫము, పురాణజ్వరము నివారణమగును.

## జ్వరాతి సారచికిత్స.

ఇసబ్గోలు అను విత్తులదెచ్చి రాత్రినీళ్ళలో నానవైచి ప్రొద్దున యావిత్తులను చేతితోనలిచి కలకండ సమముగా గలిపి సేవించినయెడల జ్వరాతిసారము నివర్తించును. శొంఠి, తిప్పతీగ, వట్టివేళ్ళు, రక్తచందనము, కొడిసెపాలచెక్క, తుంగముస్తెలు, సీమనేలవేము, మొదలగు వానిని దెచ్చి కషాయముజెట్టి సేవించిన వాంతి తాపము దాహము వాపు ఇవికల అతిఘోరజ్వరము నివర్తించును.

## జీర్ణాతిసారమునకు గంగాధరచూర్ణము.

ఆరెపువ్వు, ఉసిరికవరుగు, తుంగముస్తెలు, విషబొద్ది, ఈశ్వరివేరు, యష్టిమధుకము, మారేడుపిందెలు, నేరేడుగింజలు, మామిడిపప్పు, శొంఠి, అతివస, కురువేరు, లొద్దుగచెక్క, కొడిసెవిత్తులు, లోనగువానిని సమభాగములుగ చూర్ణముజేసి ఒకవరహాయెత్తు బియ్యపు కడుగులో పుచ్చుకొనినయెడల జ్వరాతిసారములు నివర్తించును.

## జ్వరాదులకు అనుపానము.

జ్వరమున తుంగముస్తెలు పర్పాటకము గ్రహణిరోగమున మజ్జిగ విషమున సువర్ణభస్మము లేక పలచని బంగారురేకులు వాంతి

రోగమున వరిపేలాలు, అతిసారమున కొడిసెచెక్క లేక కొడిసెవేరు లేక కొడిసెవిత్తులు రక్తపిత్తమున అడ్డసరపాకరసము మూలరోగమున జీడిగింజలు క్రిమిరోగమున వాయువిడంగములు అనువానిని అనుపానముగ గ్రహింపవలెను.

## జ్వరముయొక్క దసాధ్యములు.

శరీరమంతయు విరిగిపోయినటులుండుట అతికోపము అతిసారము, వాంతి, దప్పిక, దగ్గు, వొగర్పు, వెక్కిళ్ళు, చెమట, అరుచి మొదలగు నవి జ్వరమునందు దుపద్రవములని దెలియవలెను.

## జ్వరాతిసార లక్షణము.

జ్వరము, తాపము, కడుపునొప్పి, అరుచి, మలము జిగురుగగాని, రక్తమువలెగాని పడుట, అసహ్యముగ నుండుట మొదలగు లక్షణములున్న యెడల నివి జ్వరాతిసార లక్షణములుగా దెలియవలెను.

## జీర్ణ జ్వర హరి.

ఒకపాలు పిప్పళ్ళచూర్ణము బెల్లము రెండుపాళ్లు కలిపి మాత్రలు కట్టి పుచ్చుకొనినయెడల జీర్ణజ్వరములు నివారణమగును. అజీర్ణము, అగ్నిమాంద్యము, అరుచి, పాండువు, ఉబ్బసము, దగ్గు, మొదలగు నవియు నివారణమగును.

## జ్వరితుడు వర్జింపవలసినవి.

జ్వరముపశమించి బలము దేహమున జేరుసమయమున నెక్కువగా కష్టపడి పనిచేయరాదు ఎక్కువదూరము నడువగూడదు స్నానము చేయరాదు.

## జ్వరము విడిచిన లక్షణము.

రోగికి జ్వరము విడిచినచో శరీరమంతయు బరువు దీసివేసినటు లుండును ఆయాసము తాపము నివర్తించును అవయవములు తనకు లోబడియుండును అరుచితగ్గును ఇట్టి లక్షణములు గలిగినయెడల జ్వరము విడిచినదని దెలియవలెను.

## జ్వరాతిసారములకు కషాయము.

వట్టివేళ్ళు, శొంఠి, తిప్పతీగ, నేలవేము, ముల్లంగి, కొడిసెపండు,

తుంగముస్తెలు అతివస లోనగువానిని దెచ్చి కషాయముగాచి పుచ్చు కొనినయెడల జ్వరాతిసారములు నివర్తించును.

## జ్వరములో వెక్కిళ్ళకు చికిత్స.

కరకకాయలు, మిరియములు, నల్లతుమ్మిఆకులు, శొంఠి, దెచ్చి బాగుగా దంచి కషాయముగాచి పుచ్చుకొనినయెడల జ్వరములో గలిగిన వెక్కిళ్ళు నివారణమగును.

## జ్వ ర ము ల కు.

ఇంగిలీకము రెండుతులములు దీసుకొని చనుబాలతో మూడు దినములు చక్కగా శుద్ధిజేసి ఒక నిమ్మపండున కొక బెజ్జముజేసి పైశుద్ధి జేయబడిన యింగిలీకము నందులోబెట్టి మూసి ఆరించి ఐదు పిడకల యందు పుటముబెట్టి తనంతటతాను చల్లారినపిమ్మట నౌషధమును బయ టికిదీసి చూచినయెడల చిన్నచిన్న ముక్కలై యుండును. ఈయింగిలీక మెంత తూనికయుండునో అంతకు రెండింతలు పువ్వులుదీసిన లవంగ ముల జేర్చి కల్వమునందుంచి మూడుదినము లహోరాత్రములు మర్దించ వలెను తదుపరి నిమ్మపండ్లరసముచే మాత్రలుగట్టి ఛాయాశుష్కమొనర్చి యొకసీసాలో భద్రపఱచుకొని యుండవలయును. మిరియములుదంచి కషాయముబెట్టి మాత్రనందులోచాది పూట కొకటి వంతున నైదుదిన ములు పుచ్చుకొనినయెడల సర్వజ్వరములునివారణమగును ఇచ్ఛాపథ్యము.

2. అరతులము శుద్ధిజేయబడిన నాభి కటుకరోహిణి అరతులము శుద్ధిజేసిన యింగిలీకము అరతులము శుద్ధిజేసిన గరళ మఱితులము ఖల్వ మునజేర్చి గుంటకలగరాకు రసమున చక్కగా మర్దింపవలెను తదుపరి మాత్రలుజేసి గాజుకుప్పెలోబెట్టి యుంచుకొని వాడినయెడల సర్వజ్వర ములు నివర్తించును.

## జీ వ బ్ర హ్మ చిం తా మ ణి.

హరిదళము, నాభి, పాదరసము, గంధకము, సమభాగములుగ

జేర్చి శుద్ధిజేసి, ఖల్వముననుంచి, హంసపాదిఆకురసము, గుంటకలగరాకు రసము, తులసిఆకురసములతో చక్కగా మర్దించి, గురిగింజ ప్రమాణపు మాత్రలు జేసియిచ్చినయెడల, సర్వజ్వరములు వాయువులు సంధులు నివర్తించును ఇచ్ఛాపథ్యము.

### జ్వరాంకుశము.

రెండుభాగములు పాదరసము నాల్గుభాగములు నల్లఉమ్మెత్త విత్తులు నొక ఖల్వమునజేర్చి మొదట నిమ్మపండ్ల రసములో మర్దించ వలెను తదుపరి అల్లపురసములో మర్దించి శనగగింజంత మాత్రలుజేసి అల్లపురసమనుపానముగాబెట్టుకొని సేవించినయెడల సమస్తజ్వరములు నివర్తించును.

### జగన్నాధరసము.

తామ్రభస్మము, వంగభస్మము, పాదరసము, గంధకము, నాభి మొదలగునవి సమభాగములుగదెచ్చి ఖల్వముననుంచి మోదుగచెక్క రసమున నొకదినము మర్దించవలెను. రెండవదినమున ఉరిమిరి ఆకురస ముతో మర్దించవలెను. మర్దనజేసినతదుపరి ఈయౌషధము నొక మూకు డులోనుంచి లఘుపుటము వేసిచల్లారిన మళ్ళి మోదుగుచెక్కరసముతో నొకజాము చక్కగా మర్దించి అల్లపురస మనుపానముగా నుంచుకొని పుచ్చుకొనినయెడల తాపజ్వరము సంధులు నివర్తించును.

### జోగినీరసము.

ఒకపాలు వెలిగారము ఒకపాలు పాదరసము ఒకపాలు నాభి ఒకపాలు గంధకము ఒకపాలు తాళికపత్రి, ఒకపాలు త్రిఫలములు ఒకపాలు త్రికటుకములు ఒకపాలు అభ్రకభస్మము ఒకపాలు రస నేపాళ ఇంగిలీకములు ఒకపాలు సైంధవలవణము ఒకపాలు గరళము లోనగు వానిని గూర్చి ఖల్వముననుంచి, గుంటకలకరాకు రసమున నాల్గుజాములు మర్దించి పెసరగింజంతమందు పుచ్చుకొనినయెడల సర్వ వాయువులు నివారణమగును.

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

ఆయుర్వేద

# వైద్యసారామృతము



## (నాల్గవ ప్రకరణము)

### (త్రిదోషములలక్షణము)

త్రిదోషప్రకోపమగునపుడు, మలము తెలుపు పసుపు నలుపు గలిపి పెంటికలుగానుండి శుష్కించి పచ్చనిరంగుగలిగి బద్ధమైయుండును.

అజీర్ణమునందు మలము దుర్గంధముగను శిథిలముగను నుండును.

వాతాదిదోషములు క్షీణించినయెడల మలము పసుపువర్ణము గలిగి పెంటికలుగానుండును. జలోదరమందు మలము తెల్లరంగుగలిగియు దుర్గంధము గలిగియు నుండును.

### తైలబిందులక్షణము.

మూత్రమునందుంచిన తైలబిందువు బాగుగ వికసించినయెడల అట్టి రోగియొక్కరోగము సాధ్యము. తైలబిందువు వికసించకపోయిన యెడల అట్టిరోగము కుదురుటకష్టసాధ్యము. తైలబిందువు మునిగినయెడల అట్టిరోగము కుదురుట అసాధ్యమని నాగార్జునుడు చెప్పెను.

### త్రిఫలాదిచూర్ణము.

త్రిఫలములను, త్రికటుకములను, చూర్ణముచేసి, బెల్లముగలిపి సేవించి వేడినీళ్లు త్రాగినను, లేక నొకభాగము తెగడచూర్ణము రెండు భాగములు పంచదారచేర్చి పుచ్చుకొనినను, ఉష్ణోదకము పానముచేసినను పార్శ్వశూల అరుచి దగ్గు వాతజ్వరము నివర్తించును.

## తాంత్రిక సన్నిపాతలక్షణము.

నిలిచి నిలిచి తలచు మాటలాడుట నిద్రకలుగుట నాలుక నల్లనై ముల్లుతాకి కఠినమగుచు ద్రవములేక వరుసగా నుండుట మిక్కిలి తాపము కలుగుట విరేచనములగుట ఉఛ్వాసము దురదగలుగుట, కండ్లు పెద్దచేసి చూచుట కన్నులలో నీళ్ళుకారుట జ్వరము తీవ్రముగా నుండుట తాంత్రిక సన్నిపాతలక్షణములని తెలియవలెను.

## తామ్రి భస్మము

శుద్ధిజేసిన తామ్రిమును, అగ్నిలోకాచి నీటిలో ముంచవలెను. ఈరీతి మూడుమారులు నీళ్ళలోముంచి రేకులను వావిలాకురసములో పై చెప్పినప్రకారము తడిపి మూకుటిలోనుంచి పంచలవణములను చూర్ణముచేసి రేకులపైన క్రిందచూర్ణముబోసి పైన మూకుడుబోర్లించి చీలమన్నుజేసి పుటముపెట్టినయెడల భస్మమగును. ఆభస్మమును పిప్పలి చూర్ణము తేనెతోగలిపి పుచ్చుకొనినయెడల శ్వాసకాసలునివర్తించును.

## తాళిక భస్మము.

శుద్ధిజేసిన తాళికము రెండుభాగములు, శుద్ధిజేసిన పాదర మొక భాగము, పటిక అయిదుభాగములు దెచ్చి తెల్లగలిజేరు రసముచేత మర్దించి ఎండినతరువాత మూకుడులోబెట్టి పైననొకమూకుడుబోర్లించి చీలమన్ను వేసి గజపుటము బెట్టినయెడల భస్మమగును. అట్టిభస్మమును రోగియొక్క స్వరూపమును పదేపదే తెలిసికొని బాగుగా నాలోచించి బియ్యపుగింజ ప్రమాణము అనుపాన యుక్తముగ నిచ్చినయెడల సర్వరోగములు నివర్తించును.

## తలపోటునకు కర్ణరోగమునకు.

విషబొద్ది చేతిపాట్ల శొంఠి ఆముదపువేళ్ళు మునగవేరుచెక్క తగిరిసెవిత్తులు చెంగల్వకోష్టు సమభాగములుగ పులికడుగుతో మర్దించి తలకు కట్టినయెడల తలపోట్లు నివర్తించును పండుజిల్లేడాకులకు నెయ్యి

పట్టించి నిప్పుమీదకాచి రసముపిండి కొంచెము వేడిగానుండునపుడు చెవిలో వేసిన కర్ణరోగములు నివారణమగుట.

## తీటగజ్జి మేహాజిలలకు చికిత్స.

పాదరసము జీలకర్ర నల్లజీలకర్ర పసుపు కస్తూరిపసుపు మిరియములు గంగసింధూరము గంధకము మణిశిల సమభాగములుగ చూర్ణము చేసి యినుపబాణలిలోవైచి నెయ్యిబోసి యినుపగుండతో మెత్తగా నూరి ప్రతిదినము మూడావర్తులు పట్టించిన సర్వతీటలు మానును. మరియు పైదానిలో హరిదళము, తెగరవువిత్తులు, తంగేడువిత్తులు, భావించవిత్తులు వేసిమర్దించి దినమునకు మూడుపర్యాయములు పట్టించిన తీటలు నివారణమగును.

N. B. పాదరసము గంధకము వీనిని ముందుగామర్దించి పిదప తక్కిన వస్తువులను ప్రత్యేకము దంచి చూర్ణముచేసి అందు మిశ్రమము చేయవలెను.

## త్వగ్గతాది జ్వరములు.

జ్వరములు నాలువిధములుగా విభజింపబడియున్నవి. అవియేవన 1. త్వగ్గతము 2. అస్థిగతము 3. రక్తగతము 4 మాంసగతము.

## త్వగ్గత జ్వరలక్షణము.

త్వగ్గతజ్వరముచే రోగి పీడింపబడుచున్నయెడల వానినాడి మెల్లగా నడుచును అతిదాహముండును వాతముగూడ నుండును.

## త్రాహిక జ్వరము.

రక్తచందనము, శొంఠి, వాయువిళంగములు, తిప్పతీగ, బాలింత బోలుదెచ్చి బాగుగాదంచి కషాయముబెట్టి సేవించినయెడల త్ర్యాహిక జ్వరము నివర్తించును.

## తాళిక చూర్ణము.

4 పలములు శొంఠి, 2 పలములు మిరియములు, పలము తాలీశ పత్రి, 8 వరహాలయెత్తు పిప్పళ్ళు, చూర్ణించి పిప్పళ్ళకు యెనిమిదవవంతు చక్కెరచేర్చి సేవించినయెడల అగ్నిమాంద్యము పురాణజ్వరము పాండువు, దగ్గు, ఉబ్బసము, నివారణమగును.

## త్రికటుకాది చూర్ణము.

కరక్కాయలు, అతివస, త్రికటుకములు, ఇంగువ, ముత్తవపులగము, సౌవర్చలవణము, వీనిని సమభాగములుగజేర్చి, పొడిజేసి ఉష్ణోదకమున వేసి సేవించినయెడల నతిసారములు నివర్తించును.

## త్రివృపైత్యములకు.

అరతులము లవణము, అరతులము లవంగములు, అరతులము పిప్పళ్ళు, అరతులము కరకకాయలు, తులము తాడికాయలు, అరతులము ఉసిరికపప్పు, అరతులముపటిక, పావుతులము జీలకర్ర లోనగువానినిదెచ్చి మెత్తగాపొడిచేసి నిమ్మకాయలు నాల్గుదెచ్చి పైచర్మముదీసివేసి యిందులో వేసి ఒకకుండలో నీయౌషధమునుబెట్టి తేనెగలిపి పొంగువచ్చువరకును కాచి ప్రాతఃకాలమున నొక బద్దసేవించినయెడల త్రివృపైత్యములు నిస్సందేహముగ కుదురును.

## తాబేటి పెంకుభస్మము.

తాబేటిపెంకు నొకదానినిదెచ్చి శుభ్రము గాకడిగి నిమ్మపండ్లరసములో నొకదినమంతయు నానబెట్టి శుద్ధోదకమున కడుగవలెను. తదుపరి యొక మూకుడులో యీపెంకునుబెట్టి చీలమన్నువేసి పుటముబెట్టినయెడల భస్మమగును ఈతాబేటి పెంకు భస్మమును నువ్వులనూనెతో గలిపి పైత్యపు మచ్చలమీద బూసినయెడల నవి నివారణమగును. పైత్యముచే గలిగిన చర్మవ్యాధులన్నియు హరించును.

## త్రిలోహ షడ్గుణము.

వెండి రజ మొక తులము, రాగిరజ మొక తులము, తగరపురజ మొక తులము, పత్రతాళక మొక తులము దెచ్చి అర్కక్షీరమున మర్దించి తదుపరి యొక పిడతలో బెట్టి పైన నొక ప్రమిదమూతవేసి చీలమన్ను బెట్టి పుటము బెట్టి సాంగశీతలమైన పిమ్మట దీసిచూచినచో బిళ్ళగానౌషధముండును. దానిని తేనెలో రంగరించి యిచ్చిన యెడల దగ్గునివర్తించును. ఇచ్ఛాపథ్యం ప్రొద్దునను సాయంకాలముననను నౌషధమొసంగవలెను.

## ద్వంద్వదోషాది మలలక్షణము.

ద్వంద్వరోగి యొక్క మలము తెల్లగను, బంకగను, మిశ్రముగను నుండును. అజీర్ణమైన యెడల రోగి యొక్క మలమపక్వముగనుండును. స్వస్థునికి పక్వముగ వచ్చుచుండును.

విశేషదీపనముగలవాని మలము శుష్కముగను మందాగ్నిగలవానికి ద్రవయుక్తముగను వెలువడును. అతిదుర్గంధ యుక్తముగను చంద్రికాయుక్తముగను మలము వెలువడిన యెడల నట్టిరోగి బ్రతుకుట యసాధ్యమని దెలియావలెను.

వాతప్రకోపమునందు, బద్ధకమును, నల్లగను, మలము వెలువడును పిత్తప్రకోపమునందు పసుపువర్ణముగ వెలువడును. కఫప్రకోపమునందు నీటివలెను, నురుగుతోగూడియు, గట్టిగను తెల్లగను, వెలువడును. రక్తప్రకోపమునందు రక్తవర్ణముగలిగి, నీటితో సమముగ వెలువడును. ద్వంద్వదోషప్రకోపమునందు రెండుచిహ్నములు గలిగియు వెలువడును. త్రిదోషమునందు సర్వవర్ణములు గలిగియు వెలువడును.

## ద్విదోషత్రిదోషదూషిత నేత్రలక్షణము.

ద్విదోషప్రకోపమగునపుడు నయనములకు ద్విదోషములుండును మూడుదోషములు నయనములయందు కనుపడినచో ఆరోగి బ్రతుకడు. వాతపిత్తశ్లేష్మ ప్రకోపమునందు కన్నులీడ్చును. మరియొకప్పుడు తెరుపుడు పడినను తత్క్షణమే నీరుగ్రమ్ముచు మూతపడుచునుండును.

## దూతలక్షణము.

శ్లో॥ ఆతురోపక్రిమార్గేచ దూతోయాతిభిగ్గృహమ్
తస్యపరిచరణంకార్యం యేనసంలక్ష్యతేగదః
ఏకోదూతస్యమాగచ్ఛే గృహీత్వావంశయష్టికామ్
మరణంతస్యజానీయాద్దివసే సప్తమేతథా॥
శ్లో॥ ఏకోదూతస్సమాగచ్ఛే ద్భ్రుకుటిచపునః పునః
లిఖితంమరణంతస్య యామైకేనచ నిశ్చితమ్
ద్వౌత్రయశ్చైవ చత్వారః వృద్ధస్త్రీ బాలషండకాః
దుష్టవాక్యప్రవక్తారో రక్షాగ్నియమదిక్స్థితాః
శస్త్రాదిధారిణోభస్మ పాషాణస్థితమాశ్రితాః
ఏవం నగచ్ఛేత్తుస్స భిషగ్యశః ప్రాప్తిర్నవిద్యతే॥
షండాంధమూకబధిరాన్ రుజయాసమేతం
బాలస్త్రియాంచ వికలం తృషితంచజీర్ణమ్
శ్రాంతంక్షుధాతురమపి భ్రమితంచజీర్ణం
దూతం నశస్తమపివేద విదోవదంతి॥
అగ్రభాగే పిచాయుష్యం కష్టపృష్టవిభాగతః
వామేచ శిరసః పీడామృత్యుర్భవతి దక్షిణే
ఖోరోష్ట్రమహిషారూఢ ఉతగర్దభ కృచ్ఛ్రవాన్
పాషణ్డీ స్త్రీచరోగార్తో నశస్తాదూతకర్మణి॥
శ్లో॥ నపుంసకస్త్రీబహవశ్చనగ్నాః
శాపాయుధాః పాణివిషాణినోవా
సితేతరైశ్చాపిపటైర్వృతాఙ్గా
స్స్నిగ్ధార్ద్రదేహాస్తణిషండినశ్చ
సన్న్యాసినః పాణివిమర్దకాశ్చ
ఘ్రాణస్పృశః ప్రస్తరభేదినశ్చ
నఖద్విజోర్ధ్వాంగక ఘర్షశీలా
శోకాకులాశ్చాపిగదాభిభూతాః
చర్మాదిహస్తాః పరివేకకాస్తే
తద్వైవఖోజన్య వినాసుచాపి

పృష్ఠప్రదేశే దిశిచాపియామ్యా
ముచ్ఛస్యభాగే భిషజాం విశేషామ్
దూతాస్సమాయాన్తి నిరర్థమేతే
విపర్యయావ్యాధిత ప్రశ్నతోవా
వైద్యస్యగేహాన పితస్యదృష్టా
జీవస్థితిర్జ్ఞాని భిరత్రిము క్త్యః॥
శ్లో॥ ఆర్ద్రాశ్రేషామఘామూల జ్యేష్ఠా సుభరణీషుచ
ఉపసర్పంతియేవైద్యం దూతాస్సైచా పిగర్హితాః॥
శ్లో॥ శుక్లాంబరాః ఫలకరాదూతాశ్చ ప్రియవాదినః
అద్వితీయాశ్చభక్తాశ్చ వైద్యాహ్వానే ప్రపూజితాః॥

తా॥ వ్యాధిగ్రస్తుని యొద్దనుండి వచ్చినదూతను వైద్యుడు పరీక్షించి రోగియొక్క సాధ్యాసాధ్యంబును దెలిసికొనవలెను రోగియొద్దనుండి వచ్చినదూత వెదురుకఱ్ఱ చేతబూని ఒంటరిగా వచ్చినయెడల రోగి ఏడవదినమున మృత్యుగహ్వరంబునబడునని దెలియవలెను. మరియు దూత వైద్యుని కడకేతెంచి తాను వచ్చినకార్యమును పలుమారు చెప్పుచుండిన నారోగి ఒక యామములో నిస్సందేహముగ యమసదనంబునకు జేరునని దెలియవలెను

వైద్యునిబిలుచుటకు యిద్దరు లేక ముగ్గురు లేక నలుగురు దూతలు స్త్రీబాలవృద్ధ నపుంసకులేగినను అశుభశూచక వాక్యముల బలుకువారలేగినను అగ్నియమనైరృతిదిక్కులలో దేనియందైనను దూతనిలువంబడి వైద్యునిబిలచినను ఆయుధముల ధరించిగాని బూడిద రాయి ఎముకలుమీనిపై నిలువంబడిగాని వైద్యునిబిలచినను అశుభంబు గలుగు గావున వైద్యుడట్టి రోగికడ కేగరాదు షండుడు గ్రుడ్డివాడు మూగవాడు చెవిటివాడు రోగపీడితుడు స్త్రీలుఅంగవైకల్యముగలవాడు దీనుడు బడలినవాడు ఆకలిగొన్నవాడు చిత్తచాంచల్యము గలవాడు కృశించినవాడు దూతకృత్యమున కనర్హులని పెద్దలు వచించుదురు.

వైద్యునికడ కేతెంచినదూత వాని కగ్రభాగంబున నిలువంబడిన యెడల వ్యాధగ్రస్తున కాయుర్వృద్ధి గలుగుననియు పృష్ఠభాగంబున నిలిచిన రోగియొక్క రోగము గష్టసాధ్యంబనియు ఎడమపార్శ్వంబున

నిలచిన రోగికిశిరోరోగముగలదనియు దక్షిణపార్శ్వంబున నిలచిన రోగికి చావు దప్పదనియు దెలియవలెను గాడిద ఒంటె దున్నపోతు మొదలగు నవి వాహనములు గలవాడై యేతెంచినవాడు 'ఓ' యని పెద్దగావైద్యుని బిలుచువాడు దీర్ఘముగ డగ్గుత్తిక పడువాడు కష్టముగా మాట్లాడువాడు పాషండుడు స్త్రీరోగపీడితుడు నపుంసకుడు అనేకస్త్రీలు దిగంబరుడు పాశాయుధుడు కొమ్ముచేతధరించినవాడు తెలుపువర్ణముగల బట్టలుదప్ప యితరవర్ణము గలవి ధరించినవాడు తైలము బూసికొనినవాడు గడ్డిమోపును ఎత్తుకొనినవాడు నపుంసకులు సన్యాసులు చేతులు పిసుకుకొనువారు ముక్కును తాకువారు రాళ్ళను పగులగొట్టువాడు నఖదంత ఊర్ధ్వాంగములఁ దాకువాడు దుఃఖించువాడు వ్యాధిగ్రస్తుడు చర్మము హస్తమున ధరించినవాడును తడిబట్టను ధరించినవాడు దూతకృత్యమున కనర్హులు.

దూత వైద్యుడు భుజించునపు డేతెంచినను రాత్రిసమయమున వైద్యుని బిలుచుట కేతెంచినను దూత వానికి పృష్ఠభాగంబున నేని దక్షిణ దిక్కునందేని ఉచ్చస్థానంబుననేని నిలువంబడి యుండినను రోగమును విపరీతంబుగ వచించినను రోగి కాలాంతకుని సదనంబున ప్రవేశించి యతని భటులతో నుల్లాసంబుగ సల్లాపము లాడుచుండునని జ్ఞానియైన వైద్యశిఖామణి దెలియవలెను ఆర్ద్ర ఆశ్లేష మఖ మూల జ్యేష్ఠ భరణి నక్షత్రములయందు వైద్యునిబిలుచుట కేగెడిదూతలును నిందితులు తెల్లని వస్త్రము ధరించినవారును పుష్పఫలాదుల హస్తమున దాల్చినవారును ప్రియాలాపంబులు బల్కువారును తానువచ్చునప్పుడు మరియొకని వెంట దోడ్కొని వచ్చువారును వైద్యభక్తులును దూతకృత్యమునకర్హులు.

## దోషత్రయ శమనోపాయము.

శ్లేష్మధాతువును తీక్ష్ణమైన బాణముచేత వైరులనువలె తీక్ష్ణమైన యౌషధములచే లోబఱచుకొనవలయును వాతధాతువును స్నేహమువలన మిత్రునివలె స్నేహద్రవ్యములచే లోబరచుకొనవలయును పిత్తధాతువును చల్లనై మధురమైన క్రియలచే అల్లునివలె మధురమైన పదార్థములవలన లోబరచు కొనవలయును.

## దోషోపచారములు.

కఫప్రకోపమగు సమయమున నస్యముతో గూడిన వమనము పిత్త ప్రకోపమగు సమయమున విరేచనము వాతప్రకోపమగు సమయమున వస్తివిశోధము చేయవలెను త్రిదోషములకు తోచినంతవరకు సర్వోపచారములను జేయవలెను.

## దోషధాతుమలవృద్ధిలక్షణము.

వాతపిత్త శ్లేష్మములు రసాది సప్తధాతువులు వానిమలములు దౌర్బల్యమువలన చెడుటచే మనుష్యుడు దుర్బలుడైనయెడల యేయే అన్నపానాదులచే దోషధాతుమలంబులు పుష్టినిజెందునో అట్టి అన్నపానాదులచే వానిని వృద్ధినొందించవలెను.

దోషధాతుమలక్షయములను జెందినవాడు తానుకోరిన మధురాద్యాహారముల సేవించుటవలన పుష్టినొందును.

## దగ్గుకుపొగద్రాగుట.

తెల్లవెంపలి వేరునుదెచ్చి ఎండబెట్టి ఉకాు చిమినిలోవేసి అగ్నివేసి పొగపీల్చినయెడల దగ్గుహరించును నల్లఉమ్మెత్త చెట్టును సమూలముగదెచ్చి చూర్ణముచేసి దానిపొగ త్రాగినను దగ్గుతగ్గును. దురదగొండిచెట్టు సమూలముగాదెచ్చి చూర్ణించి దానిపొగ ద్రాగినను దగ్గు నివర్తించును.

ఆరటికాయను రెండుచీలిక లగునటులజేసి మధ్యనున్న నల్లని గిజరును దీసివేసి అందులో మిరియముల చూర్ణము నొకరాత్రియంతయు నుంచి ప్రాతఃకాలమున మందాగ్నిలోకాల్చి పక్వమైనపిమ్మట భుజించిన యెడల దగ్గు హరించును.

## ధాత్రీఘృతము.

ఉసిరికపండ్లరసమున వాయువిడంగముల కల్కము నెయ్యికల్పి

సిద్ధపరచి నెయ్యిలో చక్కెర సైంధవలవణము గలిపి పుచ్చుకొనిన యెడల సమస్త గుల్మములు నివారణమగును.

ద్వినిశాదిహోమము.

పసుపు మ్రానుపసుపు త్రిఫలయులుదెచ్చి చక్కగా దంచి రాత్రి యందు నీటిలో వేసియుంచి ప్రొద్దున బాగుగాకలుపి వడియగట్టి తేనె జేర్చి సేవించినయెడల మేహశూలలు నివారణమగును.

ద్రావణయోగము.

జమ్మిచెట్టుయొక్క రసమున శుద్ధిజేసిన పాదరసము తేనెగలిపి మర్ధించి శిశ్నమునకు బూసికొని రమించినయెడల మదించిన స్త్రీయైనను ద్రవించును.

దంతరోగచికిత్స.

ఒకకుండలో గవ్వలను తునకలుజేసి వేసి వానిపైన జీడిగింజలు జేసి చమురు యిరుకునట్లు బాగుగా వేయించి నూరి పండ్లు తోమిన యెడల సమస్త దంతరోగములు నివర్తించును పొగడచెట్టుయొక్కపట్టను నమలినయెడల కదలుచుండిన పండ్లుసైతము వజ్రమువలె నగును.

దోషాతిసారలక్షణము.

దోషాతిసార మున్నయెడల శరీరము చల్లగనుండకనుగాని అంత రాహ మెక్కువగా నుండును కాళ్ళుచేతులు చల్లగనుండును వాంతుల గును దగ్గు, అలసట యుండును పలచగా విరేచనము లగుచుండును నిద్రపట్టకుండును గర్భమున నొప్పియుండును.

సుగంధపాల, శొనుగ, తిప్పతీగ, ద్రాక్ష సమభాగములుగదెచ్చి చక్కగా దంచి రసముదీసి పాకముబట్టి సేవించినయెడల వాతజ్వరములు నివర్తించును.

దినార్ధజ్వరములకు.

ఇంగిలీక మైదుభాగములు, నేపాళవిత్తులు నాల్గుభాగములు, నాభి ఒకభాగము, రసము రెండుభాగములు, వెలిగారము మూడుభాగ ములు దెచ్చి ఉష్ణోదకమున జాముమర్ధించి గుంజమాత్రము ప్రమాణము గల మాత్రలజేసి, చక్కెరతో నొకమాత్ర సేవించినయెడల దినార్ధ

జ్వరములు నివర్తించును విషజ్వరములకు అల్లపురస మనుపానముగా నివ్వవలెను.

## దగ్గులకు.

ఒకతులము యాలకువిత్తనములు 1 తులము రససిందూరము, ఒకతులము తాళిసపత్రి, 1 తులము లవంగములు, ఒకతులము దాల్చిన చెక్క, 1 తులము శొంఠి, ఒకతులము మిరియములు, ఒకతులము కరక్కాయలు, ఒకతులము వాయువిడంగములు, ఒకతులము తాడికాయలు ఒకతులము ఉసిరికపప్పు, ఒకతులము శావాక్షీరి, ఒకతులము జాపత్రి, 1 తులము జాజికాయలు, ఒకతులము పిప్పళ్ళు, దెచ్చి చక్కగా చూర్ణించి, ఒకసీసాలో నుంచుకొని, అనుపానభేదములచే యీచూర్ణము నొసంగినయెడల సర్వదగ్గులు నివారణమగును.

2 తులముల మిరియములు పటికబెల్లము రెండుతులములు దెచ్చి మెత్తగానూరి, ఉసిరికకాయయంత చిన్నమూటనుగట్టి బుగ్గనబెట్టుకొని రసము మ్రింగుచుండిన యెడల దగ్గులు నివారణమగును. ఇచ్ఛాపథ్యము.

## దంతములకు.

కరక్కాయలు, కాకరకాయ, ఇండుపగింజ, సమభాగములుగ జేసి తులసిరసమున మర్దించి దంతములకు పూసినయెడల పండ్లనొప్పులు పోవును.

## దంతధావనచూర్ణము.

బాదముకాయల డిప్పలనుకాల్చి పటికబెల్లముగలిపి పండ్లుతోముకొనినయెడల నొప్పులు మొదలగునవి నివర్తించును.

## దీపాగ్ని

పిడికిట నణగియుండునంత లావుగలవంటచెఱుకును నాల్గుబీలికలుగ చీల్చి, అట్టి నాల్గవపాలుగానుండు చెక్కలను రెండింటిని అగ్నియందుంచి మంటవేసినయెడల దానిని దీపాగ్నియందురు.

## దశాంగధూమము

నవగ్రహములను, పిశాచములను, పారద్రోలునదియు, త్రిదోషహరంబగునదియు నగు దశాంగధూమముచేత వాసనగల్గించి సంస్కరింపబడిన యర్కము నుపయోగించినయెడల వాతాది దోషత్రయములు నివర్తించును.

## దశాంగగణద్రవ్యములు

గంధకము మైసాక్షి గుగ్గిలములైదేసిభాగంబులును చందనము జటామాంసి నాల్గేసిభాగంబులును సర్జరసము కురువేరు మూడేసి భాగంబులును వట్టివేళ్ళు నేతిలో వేయించిన నఖము చిప్పలు రెండేసిభాగములును, పచ్చకర్పూరము కస్తూరి నొక్కొక్కభాగమును నొకచో జేర్చినయెడల నది దశాంగమనబడు ఈదశాంగధూమము ఈశ్వరున కపరిమితమైన ప్రీతి.

## దుండిగపు అర్కము.

దుండిగపు అర్కము గుల్మకమును, అర్శస్సులను క్రిమిరోగములను హరించి అగ్నిదీపనమును రుచినిగలిగించును.

## దూషీవిషచికిత్స

దూషీవిషముచే పీడింపబడినవానికి తొలుత స్నేహమొనర్చి తదుపరి దిరిసెనచెట్టుయొక్క వేరును పత్రములను పట్టను పుష్పములను కాయలను గోమూత్రముననూరి శరీరమునకు బూయవలెను.

ఇది నాల్గవ పరిచ్ఛేదము.



శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

ఆయుర్వేద

# వైద్యసారామృతము



## (ఐదవ ప్రకరణము)

### అష్టస్థాన పరీక్షా క్రమము

వైద్యుడు ప్రథమమున రోగియొక్క ముందుచెప్పిన అష్టస్థానములను పరీక్ష చేయవలెను.

వైద్యుడు ముందుగా వాతపిత్తశ్లేష్మములలో ఇది ప్రబలముగానున్నది ఇది స్వల్పముగానున్నది అను విషయము తెలిసికొనుటకై నాడిని పరీక్షచేసి ఆనాడియొక్క ఆద్యంత స్థితులెరుంగవలెను.

ప్రపంచమున వీణయందుండు తంత్రులను మ్రోయించుటవలన సర్వరాగములు బలుకు విధమున హస్తగతమగు నాడి సమస్తవ్యాధులను దెలియజేయును.

శరీరమున నుండుమలము చెమటవలన సమస్తరోగములుజన్మించును మలము చెడుటకు మూలకారణమేమన అపథ్య పదార్థ భక్ష్యపానాదులే రోగము దెలిసికొనుటను నిదానము నిదానమును దెలిసికొనుటకు రోగంబును కారణములై యున్నవి.

ప్రథమమున సమస్తవ్యాధులయందు, నాడి, జిహ్వా, మూత్రము, పరీక్షచేసి, తదుపరి యౌషధ మొసంగవలెను.

లోకమున ఏవైద్యునికి నాడి, నాలుక, మూత్రము, వీనియొక్క నిదానము దెలియకుండునో అట్టివాడు జనులను జంపుటకే జన్మించె కాని జనులకు మేలుచేయుటకు జన్మించినవాడు గానేరడు.

దేశకాలములను రోగముయొక్క బలాబలములను దెలిసికొని తనుపరి చికిత్స చేసినయెడల వైద్యునికి కీర్తి చేకూరును.

## నాడీపరీక్షాక్రమము.

వైద్యుఁడు రోగిసంబంధమైన కుడిచెయ్యియొక్క అంగుష్ఠమూలముకు (అనఁగా మణికట్టునకు వెనుకనుండు మూడంగుళముల ప్రదేశము) తన కుడిచేతి మూఁడువేళ్ళతోఁ తాఁకి నిదానమును జూడవలెను నాడిని చూచునప్పుడు, స్థిరచిత్తుఁడై, ఆత్మను మనస్సును శాంతిజేసుకొని రోగియొక్క సవ్యహస్తమును తనయొక్క మూఁడువ్రేళ్ళలోఁ పట్టుకొని దోషము దెలిసికొనవలయును. స్త్రీలకు ఎడమచేతియందును, పురుషులకు కుడిచేతియందును నాడి స్పష్టముగ నుండును. హస్తనిదానము దెలిసికొను సమయమున రోగియొక్క హస్తమును పిసికి మెటికలువిరిచి చేతినిచాపించి వ్రేళ్ళయొక్క పట్టువదలి వైద్యుఁడు నిదానమునుచూచి వ్యాధి నెరుంగవలెను.

## నాడీపరీక్షాకాలము.

ప్రాతఃకాలమున రోగియొక్క చేతియందు మణికట్టుకు వెనుకట్టున నాడిని పరీక్షచేయవలెను. రోగియొక్క నాడిని మాటిమాటికి పట్టి విడుచుచు తనప్రజ్ఞచేత చక్కగా మూఁడుమారులు పరీక్షించి రోగము నెరిగి యౌషధ మొసంగవలెను.

రోగియొక్కనాడిని వైద్యుఁడు తనయొక్క మూఁడువ్రేళ్ళచేత స్పృశించి వాతపిత్త కఫములయొక్క గతుల క్రమముగ మంద మధ్యమ తీవ్రములను తెలిసికొనవలెను. వాతపిత్త కఫములే త్రిదోషములుగా నెరుంగవలెను వీనిని వైద్యుఁడు సూక్ష్మదృష్టిచేత దెలిసికొనవలయును. వాతపిత్త కఫములను, ద్వంద్వములగు వాతపిత్త, కఫపిత్త, కఫవాతములను, దోషత్రయము లేకీభవించుటచే పుట్టినట్టి సన్నిపాతమును సాధ్యాసాధ్యములను, నాడి స్పష్టముగా దెలుపగలదు. నాడికి పర్యాయ శబ్దంబు లెనమిది 1 స్నాయువు 2 నాడి 3 హింస్రా 4 ధమనీ 5 ధారణి 6 ధరా 7 తుంతుకీ 8 జీవనజ్ఞానా.

## నాడీదేవతలు.

శ్లో॥ వాతనాడీ భవేద్బ్రహ్మా పిత్తనాడీచ శంకరః
శ్లేష్మనాడీభవేద్విష్ణు స్త్రిదేవానాడి దేవతాః॥

వాతనాడికి బ్రహ్మదేవత పిత్తనాడికి శంకరుడుదేవత శ్లేష్మనాడికి విష్ణుదేవత ఈవిధముగ త్రివిధనాడులకును త్రివిధదేవతలని దెలియవలెను.

## నాడి స్పష్టపడని కాలము.

నాడిని స్పష్టముగా నేటికాలపు వైద్యులెరుంగజాలక థర్మామీటరులను వాడుచున్నారు. నాడిని చక్కగా దెలిసికొనియు శాస్త్రానుభవము గలిగియు వైద్యముచేయునట్టి మహానుభావుడే ధన్వంతరియని చెప్పవచ్చును. భోజనమైనపిదపయు, జలకమాడిన తదుపరియు, మిక్కిలి క్షుద్బాధచే పీడింపబడునప్పుడు, కాముకేళి దేలినతదుపరియును, పరుగెత్తి అలసియుండు సమయమునను, నిద్రనుండి లేచినపిమ్మటను, నాడి స్పష్టముగా దెలియజాలదు. అట్టిసమయములయందు పరీక్ష చేయరాదు అభ్యాసమువలన దెలియవచ్చును.

## నక్షత్ర లగ్న తిథి వార సాధ్యలక్షణము.

శ్లో॥ అహిర్బుధ్న్యాశ్వతిష్యసంజ్ఞైర్యమదే
ప్రాజాపత్యాదిత్య యోస్సప్తరాత్రిః
రోగోత్పత్తిర్జాయతే మానవానాం
నిస్సందిగ్ధంజల్పితం గర్గముఖ్యైః॥

శ్లో॥ నందాచవృశ్చికేమేషే భద్రామిథునకన్యయోః
కర్కేచైవజయాసింహే కుంభేరిక్తాతుభేవృషే
ధనుర్యుగ్మేచమకరే పూర్ణాతిథిరుదాహృతా
విరుద్ధోరోగిణాంనూనం నందాది స్థితిపంచకః॥

శ్లో॥ భామకృత్తికయోర్నందా
భద్రయోర్బుధనాగయోః
జయాంగురా ముఖాయాంచ
రిక్తాశుక్ర ధనిష్ఠయోః॥

శ్లో॥ భరణ్యాం శనివారేచ
పూర్ణేచ తిథిపంచకే
యోగేஉస్మిన్వ్యాధిరుత్పన్నో
నసిధ్యతికథాచన॥

ఉత్తరాభాద్ర, పుష్యమి, రోహిణి, పునర్వసు, మొదలగు నక్షత్రములయందు వచ్చినవ్యాధి సప్తదివసంబులలో నిస్సందేహముగ నివారణమగును. నందయనుపాడ్యమి, షష్ఠి, ఏకాదశి, మేష వృశ్చిక లగ్నములయందును, భద్రయనువిదియ, సప్తమి, ద్వాదశి తిథులయందును, మిథున కన్యాలగ్నములయందును, జయయను తదియ అష్టమి త్రయోదశి తిథులయందును, కర్కాటక సింహలగ్నములయందు, రిక్తయను చవితి నవమి చతుర్దశి తిథులయందు, తులావృషభకుంభములయందు, పూర్ణయను పంచమి, దశమి పౌర్ణమాస్య తిథులయందు ధనుర్మీన మకరలగ్నములయందు, రోగమువచ్చినయెడల మిక్కిలి బాధకలుగజేయును.

మంగళవారము, కృత్తికానక్షత్రము, నందయను తిథులు, బుధవారము ఆశ్లేషా నక్షత్రము, భద్రతిథులు, గురువారము మఖానక్షత్రము, జయయను తిథులు, శుక్రవారము ధనిష్ఠానక్షత్రము, రిక్తయను తిథులు, శనివారము భరణీనక్షత్రము, పూర్ణతిథులు, వీని సంయోగములయందు, రోగము వచ్చినయెడల రోగి తప్పక మృత్యుగహ్వరంబున బడును.

## నక్షత్రైర్మృత్యురోగ నివృత్త్యోర్లక్షణము.

స్వాతి, ఆశ్లేష, ఆర్ద్ర, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, పూర్వఫల్గుని జ్యేష్ఠ ఈనక్షత్రములయందు రోగముప్రారంభమైనయెడల నారోగి కాలుని పురంబునకు తప్పకపోవునని వైద్యుడెరిగి యతనికి చికిత్స చేయుట మానవలయును. రేవతి, అనూరాధ నక్షత్రములయందు రోగము ప్రారంభమైన మిక్కిలి కష్టము కలుగజేసి రోగి ప్రాణముల దీయును. ఉత్తరాషాఢ, మృగశిర, నక్షత్రముల రోగము ప్రారంభమైన ఒకమాసము రోజులలోను మఖానక్షత్రమున జనించినరోగము 20 రోజులలో హస్త ధనిష్ఠ విశాఖ నక్షత్రంబుల జనించినరోగము 15 రోజులలోను

మూలా ఆశ్విని కృత్తికా నక్షత్రంబుల జనించినరోగము తొమ్మిది దివసంబులలోను నివారణయగును.

## నక్షత్ర జన్మఫలము.

కృత్తికా నక్షత్రమున జనించినరోగము సప్తరాత్రులును, రోహిణీ నక్షత్రమున జనించినరోగము త్రిరాత్రములును, మృగశిర నక్షత్రమున జనించిన రోగము సప్తరాత్రములను, పీడించును. ఆర్ద్రా నక్షత్రమున జనించినరోగము పునర్వసు నక్షత్రమున జనించినరోగము పుష్యమి నక్షత్రమున జనించినరోగము రోగి ప్రాణముదీయును. ఆశ్లేష మఖ నక్షత్రముల జనించినరోగము రోగిని కాడువాసమునకీడ్చును పుబ్బ నక్షత్రమున జనించిన వరుసగ రెండునెలలు లేక పక్షదివసములలో రోగిని యమవాటిక కంపును. హస్తనక్షత్రమున జనించిన రోగము రోగిని యేడుదినములలోను, చిత్తానక్షత్రమున జనించినరోగము పక్షము దివసములలోను, స్వాతీ నక్షత్రమున జనించిన రెండు నెలలలోను విశాఖ నక్షత్రమున 20 వది దినములలోను, అనూరాధా నక్షత్రమునజనించిన పదిదినములలోను, జ్యేష్ఠా మూలయందైనచో పక్షదివసంబులలోను, పూర్వాషాఢా నక్షత్రమున జనించిన పక్షములోను, ఉత్తరాషాఢయందు జనించిన రోగము 20 వది దినములలోను, శ్రవణనక్షత్రమున జనించిన రోగము రెండునెలలలోను, ధనిష్ఠా నక్షత్రమునజనించిన 15 దినంబులలోను, శతభిషమందైన పదిదినములలోను, పూర్వాభాద్రయందైన పందొమ్మిది దినములును, ఉత్తరాభాద్రయందైన 45 దినములలోను, రేవతియందైన పదిదినములలోను, అశ్వినియందు జనించిన పదిదినములలో నివర్తియగును. భరణీ నక్షత్రమందైన యమనివాటిక జేరునటులజేయును. కావున పూర్వోక్త అశ్విన్యాది నక్షత్రముల జనించిన రోగముల శుభాశుభ ఫలముల నీవిధిగా నెరుగవలయును.

## నాగరాదిచూర్ణము.

కర్షప్రమాణముగల శొంఠిచూర్ణము కాంజికముతో సేవించిన యొడల ఆమవాతము, కఫవాతము నివర్తించును.

## నారాయణతైలము.

పెన్నేరుగడ్డ, ముత్తవపులగము, మారేడుపింటెలు, విషబొద్ది, నేలములక, పెద్దములక, పల్లేరువేళ్ళు, పెద్దముత్తవపులగము, వేపచెక్క, తురకవేపచెక్క, తెల్లగలిజేరువేళ్ళు, మైనవుతీగ, ఆముదపువేళ్ళు, మొదలగువాటినెల్ల 40 తులములుదెచ్చి చక్కగాదంచి అందులో 4096 తులములనీళ్ళుబోసి నాల్గవభాగముగ దించుకొని వడియగట్టి, 256 తులముల మంచినూనెగలిపి పిల్లిపీచరరసము 256 తులములు, ఆవుపాలు 1024 తులములు గలిపి తదుపరి, కోష్టు, యాలకులు, శ్రీగంధపుచూరు దర్భవేళ్ళు, వస, జటామాంసి, సైంధవలవణము, పెన్నేరుగడ్డ, ముత్తవపులగము, సన్నరాష్ట్రిము, పెద్దసోపు, దేవదారుచెక్క, అడవిబంగిఆకు, అడవిసెనగలు, అడవి మినుములు, అడవిపెసలు, తగిరిసెపత్రులు, ఇవి దినుసు ఒకటింటికి 8 తులములచొప్పున చూర్ణముగాని కల్కమునుగాని అందులో చేర్చి, సూక్ష్మాగ్నిచేత పక్వముగవండి దించుకొని, ధాన్యరాశిలోనుంచి, పూజజేసి నైవేద్యములిచ్చి, అభ్యంగము, పానము, నస్యము, మర్దనము, చేసికొనినయెడల పక్షవాతము, గ్రీవావాయువు, నడుమునొప్పులు, కడుపునొప్పి, కాళ్ళనొప్పి, చెవుడు, గతిభంగవాయువు, కటిభంగవాయువు, కాళ్ళుచేతులు మండుట, రక్తవికారము, ధాతుక్షయము, జ్వరములు, క్షయ, అండవాయువు అంత్రవృద్ధి, వృషణ స్థూలరోగము, దంతరోగము మస్తకవాయువు, పార్శ్వశూలలు, పంగుత్వము, బుద్ధిభ్రంశము, గృధ్రసివాయువు మొదలగు ఎనుబది వాతములను హరించును.

## నాగభస్మము.

శుద్ధమైన మృతమగు నాగభస్మము 2 గురిగింజలయెత్తును పసుపు ఉసిరికవలుపు చూర్ణము వీటితో చేర్చి తేనెలో సేవించినయెడల సర్వమేహములు శాంతించును.

## నాడీవ్రణభగందరచికిత్స.

కరక తాండ్ర ఉసిరికలు శొంఠి పిప్పళ్ళు మిరియములు లోనగు

వానిని చూర్ణించి యాచూర్ణమునకు సమముగ శుద్ధిజేసిన గుగ్గిలపు చూర్ణము గలిపి నేతితో సేవించినయెడల నాడీవ్రణములు మానును. మరియు భగందరమునకు ముందుగ రక్తము తీయించి పిమ్మట వ్రణమునకు జేయునట్టి చికిత్సలు చేయవలెను.

### నేత్రరోగచికిత్స.

మునగాకు రసమును తేనెతోగూడా కన్నులకు వేసిన సమస్త నేత్రవ్యాధులు నివారణమగును. కురసిరాళ్ళు సూంతు కరక్కాయలు, సైంధవలవణము, మ్రానిపసుపు, మంచిపిప్పళ్ళలో చాది కంటిపట్లు పట్టు వేసినయెడల నేత్రరోగములు నిస్సందేహముగ నివారణమగును.

నేత్రవ్యాధులకు రసకేశ్వర కటుకములు కల్పిప్పరి సైంధవ లవణము జేయించిన మైలతుత్థము పేలిచిన వెలిగారము, శొంఠి, పిప్పళ్ళు మిరియములు లోనగువానిని చూర్ణించి నిమ్మపండ్ల రసముతో మర్దించి వటుకములుచేసి ఛాయాశుష్కమొనర్చి తేనెతో అరగదీసి కన్నులకు వేసిన కన్నులయందుండు ఉష్ణము, ఘుసులుగారుట, పూలుపడుట, దుర్మాంసము పెరుగుట, రేచీకటి, మొదలగునవి నివారణమగును.

### నేత్రపరీక్షలక్షణము.

వాతరోగియొక్క కన్నులు తెల్లగనుండి నొప్పి గలిగించుచుండును. ఎప్పుడు నీరుగారుచుండును.

పైత్యరోగియొక్క కన్నులు పచ్చగాను, ఎఱ్ఱగానుండును.

శ్లేష్మరోగియొక్క కన్నులు తెల్లగను, మసిపువర్ణముగనుండును.

సన్నిపాత రోగియొక్క కన్నులరంగు మిశ్రమమై యుండును.

కామిలవ్యాధిచే పీడింపబడువాని కన్నులు పచ్చగానుండును. దీనికి తగినచికిత్స చేయనియెడల ప్రాణాపాయము గలిగించును.

### నాడీసంచారము.

ప్రాతఃకాలమున నాలుగు ఘడియలవరకును పైత్యనాడి చరింపు

చుండును. మధ్యాహ్నమున శ్లేష్మనాడి చరింపుచుండును. మధ్యాహ్నము నుండి సాయంత్రమువరకును వాతనాడి చరింపుచుండును. అపరాత్రిలో పైత్యనాడి చరించును. ఈ విధముగా నాడీ సంచారక్రమమును వైద్యశిఖామణులు తెలిసికొందురుగాక.

నోరు యిగురుప్పుకొని పోయినందులకు యిండుపగింజలు అక్కలకఱ్ఱ ఓమము మొదలగువానిని దెచ్చి చక్కగా దంచి కషాయముబెట్టి సేవించినయెడల నోరుయిగురుప్పుకపోవుట నివర్తించును.

## నీళ్ళవిరోచనములకు చికిత్స.

దానిమ్మచెక్క, కొడిశెపాల, తుంగముస్తెలు, అతివస, ఆరెపువ్వు, అగరుశొంఠి, లొద్దుగచెక్క, వట్టివేళ్ళు, సోనాకు వానిని దెచ్చి చక్కగాదంచి కషాయముబెట్టి బాగుగనునుచూర్ణముచేసి, అందులో కలిపి, తేనె ననుపానముబెట్టి సేవించినయెడల నీళ్ళ విరేచనములు నివారణమగును.

## నోరువంకరకు.

ఒకపాలు శుద్ధిజేసిన తాళకము, ఒకపాలు శుద్ధిజేసిన రససింధూరిము, ఒకపాలు పిప్పళ్లు, ఒకపాలు కటుకరోహిణి. ఒకచోటజేర్చి చక్కగాదంచి, చూర్ణముజేసి, ఎనిమిదిజాములు మునగపూలరసమునమర్దించి చింతగింజలప్రమాణపు మాత్రలుగట్టి పూటకు రెండుమాత్రల వంతున సేవించినయెడల కంపవాతము మొదలగునవి నివర్తించును.

## నస్యము.

తాళిసపత్రి, మునగవిత్తులు, లవంగపుచెక్క, ఆవాలు, కానుగవిత్తులు చూర్ణముచేసి పీల్చినయెడల సమస్త శిరోవ్యాధులు నివారణమగును.

## నోటికురుపులకు

జాపత్రి, దూలగొండివేరు, తిప్పతీగె, మానిపసుపు, తీగద్రాక్ష

కరకకాయలు, తాడికాయలు, ఉసిరికకాయలు దెచ్చి సమభాగములు జేర్చి కషాయముజెట్టి తేనెగలిపి పుక్కిలించినయెడల నోటిపూతపూవులు నివర్తించును.

## నిద్రపట్టనియెడల.

జాజికాయ వరహాయెత్తు, జాపత్రి పలము, పిప్పళ్ళు చూర్ణము చేసి నెయ్యిగలిపి భోజనము చేయుటకు పూర్వమున సేవించినయెడల చక్కగా నిద్రపట్టును.

N. B. అరలవము పిప్పళ్లు వేయించినవి, అరపలము వేయించనివి యుపయోగించవలెను.

ఇది

ఐదవ ప్రకరణము.



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ఆయుర్వేద

# వైద్యసారామృతము

(ఆరవ ప్రకరణము)

## పిత్తశ్లేష్మ నాడీలక్షణము.

కప్పవలెను హంసవలెను నాడి మధ్యమాంగుళముల యొక్క మధ్యమందు సంచరించుచు ఎగిరెగిరి మెల్లగా సంచరించినయెడల పిత్త శ్లేష్మ నాడియని తెలియవలెను.

## పిత్తజ్వర నాడీపరీక్ష.

వాతజ్వరము వచ్చినయెడల నాడి వక్రముగను, చంచలముగను చరించుచుండును. మెయ్యి చల్లగా నుండును.

## పిత్తశ్లేష్మనాడి.

పిత్త కఫనాడి సూక్ష్మముగను, శీతలముగను స్థిరముగను చరించును,

## పిత్తప్రకోపాదులయందు లక్షణాంతరము.

శ్లో॥ అచ్ఛంచరూక్షంచ సితంచవాతా
దుష్టారుణం పీతమధోఽతిపిత్తాత్
స్నిగ్ధంఘనం శుక్లతరంకఫాచ్చ
మిశ్రైస్త్రిమిశ్రం సకలస్యచిహ్నమ్॥

శ్లో॥ వాతేనమస్తందధ్నాతి పిత్తేనోబుద్బుదాయతే
కఫేనబిందుమాయాతి విమజ్జతిత్రిదోషజే॥

శ్లో॥ ఛదపీఠ పృథుకదర్పణ పద్మచ్ఛత్రశంఖ సచామరవీణామ్
కుండలాకృతి ఘనదిభవేత్తైలం రోగిణో హి యస్య న తు సాధ్యః
షట్కోణార్ధ్రస్వస్తిసింహాసనాకారైస్సర్పవానరవితానవృశ్చికైః
సమ్యక్తైలైశ్శంతురోగిణో యస్య మూత్రే పతితం సగతాయుః

శ్లో॥ శ్వేతధారా మహాధారా పీతధారా తథా జ్వరః
రక్తధారాదిష్ఠరోగః కృష్ణా చ మరణం ధ్రువమ్॥

శ్లో॥ సౌవీరేణసమం తప్తం మాతులుంగసమప్రభమ్
పానీయస్య సమం మూత్రే మపక్వరసతో భవేత్॥

శ్లో॥ అధో బహుళీ పురక్తం మూత్రమాలోక్యతే యదా
పచంతి తదతీసార లింగం తు లింగవేదినః
జలోదర సముద్భూతం మూత్రం కుంకుమపింజరమ్
మతేచ పీతవర్ణంచ బహుళంచ ప్రజాయతే॥
పీతంస్వచ్ఛం జాయతే మూత్ర పిత్తోదయే సతి
సమధాతౌ ప్రసన్నరూప జలతుల్యం ప్రజాయతే
మూత్రంచ కృష్ణతాం యాతి క్షయరోగాకులస్య చ
క్షయరోగో భవేద్యస్య తమసాధ్యం వినిర్దిశేత్
ఊర్ధ్వం పీతమధోరక్తం మూత్రం తు వైద్యవరస్తదా
పిత్తప్రకృతి సంభూతం సన్నిపాతస్య లక్షణమ్
యస్యేక్షురససంకాశం మూత్రం నేత్రే౽పి పింజరే
రసాధిక్యం విజానీయాన్నిర్దిశేత్తస్య లంఘనమ్
పీతంచ బహుళంచైవ ఆమవాతాత్ప్రజాయతే
రక్తంస్వచ్ఛంచ యన్మూత్రం తజ్జ్వరాధిక్యలక్షణమ్
ధూమ్రవర్ణం యదా మూత్రం జ్వరాధిక్యం వదేత్తదా
కృష్ణమచ్ఛంచ జానీయాత్సన్నిపాతజ్వరోద్భవమ్
పీతం తథోపరి కృష్ణచ్ఛాయం బుద్బుదసంయుతమ్
మూత్రం ప్రయాతి దోషేణ సంశయో నాస్య వైద్యరాట్
అపీతరక్తఫేనాదిమస్తు చేక్షురసోపమమ్
పిత్తే౽నిలే కఫే మూత్రం నిరామే చ జ్వరే భవేత్॥

వాతాధిక్యంబున మూత్రము స్వచ్ఛముగను, రూక్షముగను, తెలుపువర్ణము గలదిగను, పిత్తాధిక్యంబున అపరిమిత వేడిగలదిగను, రక్తమిశ్రిత పీతవర్ణము గలదిగను, శ్లేష్మాధిక్యంబున స్నిగ్ధంబుగను బరువుగను, అపరిమిత శ్వేతవర్ణముగను, ద్వంద్వరోగంబున మిశ్రవర్ణము గలదిగను, సన్నిపాతంబున సమస్త చిహ్నంబులను గలదిగ నుండును.

అల్పాచమానమందు విడిచిన మూత్రబొట్టు వాతరోగంబున పాములాకారంబుగను పిత్తరోగంబున బుద్బుదాకారంబుగను, కఫరోగమున చిన్నబిందువులుగను, త్రిదోషమున మునుగునదిగనుండును.

వ్యాధిగ్రస్తుని యొక్క అల్పాచమానమందు విడచిన మూత్రబొట్టు భద్రపీఠము, అటుకలు, దర్పణము, పద్మము, ఛత్రము, శంఖము, చామరము, వీణ కుండలము మొదలగువానిలో దేని ఆకారంబుగ నేర్పడునో అట్టివాని యొక్క వ్యాధి సాధ్యమని యెఱుంగవలయును. మూత్రమున విడిచిన తైలబిందువు, పక్షి, తాబేలు, ఎద్దు, సింహము, అడవిపంది, పాము, కోతి, ధ్వజము, తేలు, కోడి వీనిరూపముగ నేర్పడినయెడల అట్టివానిరోగ మసాధ్యమని యెఱుంగవలెను.

**అల్పాచమానము తెల్లగను, పీతవర్ణముగను మహాధారగను వచ్చుచుండినయెడల జ్వరంబని తెలియవలెను. రక్తవర్ణముగ నుండినయెడల దీర్ఘజాడ్యమని తెలియవలెను. నల్లగ వచ్చుచుండినయెడల మృత్యువు దప్పదని తెలియవలెను. రోగపీడితుండు సౌవీరతుల్యముగను వేడిగను మాతులుంగ ఫలరస తుల్యంబుగను శుద్ధోదకంబువలెను మూత్రమును విడిచినయెడల ఆమూత్రము అపక్వరసమువలన గలిగినదని తెలియవలెను.**

**మూత్రమున కధోభాగంబున మిగుల రక్తముగ నుండినయెడల అతిసారరోగలక్షణమని తెలియవలెను. నేతికణములవలెనుండినయెడల జలోదరంబనియు, వత్సలోగాని, చల్లలోగాని, సమానముగ వచ్చినయెడల, ఆమవాత రోగమనియు, కుంకుమవలె ఎఱ్ఱగనేని, మలములో గలిసి పీతవర్ణమువలెను వచ్చినయెడల వాతజ్వరమని తెలియవలెను.**

**పసుపువర్ణముగలదై స్వచ్ఛముగ నుండినయెడల పిత్తజ్వరమనియు**

కాంజిల తుల్యముగ వచ్చినయెడల సమధాతువనియు కృష్ణవర్ణంబుగ నుండినయెడల క్షయరోగమనియు దెలియవలెను. అట్టిక్షయరోగ మసాధ్యము పాత్రలోని మూత్రము పైభాగమున పీతవర్ణము గలదిగను అధోభాగమున రక్తవర్ణము గలదిగ నున్నయెడల పిత్తప్రకృతి సన్నిపాతరోగమనియు ఇక్షురసతుల్యముగ నేత్రములు పింజరవర్ణము గలదిగ నుండిన రసాధిక్యరోగమనియు దెలిసికొని లంఘనమును చేయింపవలెను. పీతవర్ణముగనుండి అధిక మూత్రోత్సర్జనంబగుచుండిన ఆమవాత రోగంబనియు తేటగను రక్తవర్ణముగ నుండిన ఆమవాత జ్వరాధిక్య లక్షణమనియు నిర్మలమై కృష్ణవర్ణముగ నున్నయెడల సన్నిపాత జ్వరంబనియు దెలియవలెను.

మూత్రము అధోభాగమున పీతవర్ణము గలదిగను పైభాగమున కృష్ణవర్ణము గలదిగ నుండి బుద్బుదముద్భవించినయెడల ప్రసూతి రోగమని దెలియవలెను. మూత్రము పిత్తరోగమున పీతవర్ణము గలదిగను వాతరోగమున రక్తవర్ణము గలదిగను శ్లేష్మరోగమున నురుగులతో గలసినదిగను నిరామమున మాగడవలెను జ్వరమున చెరకురసమువలెను దెలియవలెను.

## పిత్తనేత్రలక్షణము.

పిత్తప్రకోపమున కన్నులు పసుపువర్ణముగను ఎఱుపువర్ణముగను ఆకుపచ్చ వర్ణముగ నుండి దీపమును చూడలేకుండును.

## ప్రాణసంఖ్యాప్రమాణము.

మనుష్యుఁడు ప్రతినిత్యము 21600 ఉచ్ఛ్వాస నిశ్వాసలు విడుచుచుండును. అట్టి యుచ్ఛ్వాస నిశ్వాసలు కాలాధీనంబై నశించును. దేహమనెడి గేహమున వాయువనెడి రక్షపాలకుడు నివసించియున్నాడు అట్టివాయువు ప్రవేశకాలమున పదియంగుళముల ప్రమాణముగలదిగను నిర్గమన కాలంబున ద్వాదశాంగుళి ప్రమాణంబు గలదిగ నుండును. పురుషునకు మనస్సు చలింపక నుండవలెను. అందువలన వాయువును, వాయువువలన నగ్నియు స్థిరంబుగనుండును. అట్టి యగ్ని యెల్లప్పుడును కాలమునే నిరీక్షించుచుండును.

## శంఖద్రావకము.

జిల్లేడుపట్ట, జెముడుపట్ట, ఆకుజెముడుపట్ట, చింతచెక్క, మోదుగచెక్క, అరటిపండ్లు, నువ్వుకట్టె, ఉత్తరేణి, గవ్వలు, శంఖము, తెగడ మొదలగువానిని దెచ్చి వేరువేరుగా భస్మముచేసి వేరువేరుగా క్షారము తీసి, పాదరసము, పంచలవణములు, పంచక్షారములు, మొదలగునవి ఒక్కొకతులము గంధకము, మూడుతులములు కురవిరాళ్లు, ఖడ్డి, ఉప్పు, అన్నభేది, నవాసాగరము మొదలగు వస్తువులు వేరువేరుగా 6 తులములు చొప్పున చేర్చి చూర్ణముచేసి, నిమ్మపండ్లరసముచేత మర్దించి ఊర్ధ్వనలికా యంత్రమున వాలుజాములువండి ద్రావకము తీసుకొని గాజుసీసాలో నునిచి, తులములో నలువదియవ భాగముగాని యిరువదియవ భాగమును గాని నీళ్ళలోనైనను శొంఠిచూర్ణముతోనైనను సేవించినయెడల గుల్మములు, మూలవ్యాధులు, ప్లీహారోగములు నివర్తించును.

పిప్పలిచూర్ణము మాదీఫలము వెన్నతోగలిపి పుచ్చుకొనిన యెడల హృద్రోగములు క్షయలు, నివర్తించును.

## పంచక్షారములు.

1 సద్యక్షారము 2 యవక్షారము 3 గాజుప్పు 4 అప్పళాక్షారము 5 సాంబ్రాణి.

## పూర్ణచంద్రోదయము.

ఒకపలము శుద్ధిజేయుబడి చిన్నముక్కలుగా కత్తిరింపఁబడిన కుందనపు బంగారురేకులు, ఎనిమిదిపలములు శుద్ధిజేయబడిన పాదరసము పందొమ్మిది పలములు శుద్ధిచేయబడిన ఆమరశిల గంధకను ఖల్వమున జేర్చి ఎఱ్ఱపత్తిపువ్వుల రసముతో నొకదినమంతయు చక్కగామర్దించవలెను. మరి ఒక దినము పైమందునే కలబందరసములో మర్దించవలెను. తదుపరి శనగగింజ ప్రమాణముగల మాత్రలుజేసి, గాజుకుప్పెలో నునిచి, చీలమన్నువేసి వాలుకాయంత్రమునందు మృదుతీక్ష్ణ గాఢాగ్నులచే మూడు దివసములు వండవలెను. స్వాంగశీతలమైన తదుపరి యంత్రము నుండి దియ్యవలెను. మాత్రలు చిగురుటాకులవలె నెఱ్ఱగా నుండినచో యౌషధము చక్కగా సిద్ధమైనదని యెరుగవలెను. ఒకపలము పచ్చ కర్పూరము, ఒకపలము జాజికాయలు, ఒకపలము లవంగములు, ఒక

పలము పిప్పళ్ళు, నాల్గు మినవగింజలప్రమాణమైన మంచి కస్తూరియు నూరి పైమందులో మిశ్రితే మొనర్పవలెను. ఈయౌషధమును మినప గింజంత తాంబూలములో సేవించినయెడల వీర్యవృద్ధి గలుగును. ఎట్టి మదించిన స్త్రీనైనను తృప్తిపరుపగల శక్తిగలవాడగును. ఈయౌషధ సేవనమువలన దీర్ఘకాలమునకు యౌవన వంతులై యుందురు. నెయ్యి, పెరుగు, మధుర భక్ష్యములు, మీగడ, వెన్న, ఫలములు, మొదలగు పుష్టినొసంగు పదార్థముల భుజింపవలెను. ఈ యౌషధ సేవనముచే నూర్గురుస్త్రీలనైన తృప్తి పరచగలడు. ఒకసంవత్సరము సేవించిన సమస్త విషములును నిర్వీర్యముగలవగును సర్వరోగములు నశించును.

వసంత కుసుమాకరము.

2 పాళ్ళు సువర్ణభస్మము, 2 పాళ్లు వెండిభస్మము, మూడుపాళ్ళు కాంతభస్మము, మూడుపాళ్ళు రసభస్మము, నాల్గుపాళ్ళు అభ్రకభస్మము, నాల్గుపాళ్ళు ముత్యపుభస్మము ఖల్వమునునుంచి చెఱకురసము, ఆవుపాలు, అడ్డసరపాకురసము, చందనకషాయము, వట్టివేరు కషాయము, కురువేరు కషాయము, పసుపు కషాయము, అరటిగడ్డరసం తామరదుంప రసం జాజి మొగ్గ రసం మొదలగువానితో ప్రత్యేకముగ వొక్కొక్కదానిలో నేడేసి సారులు మర్దించవలెను. తదుపరి కస్తూరితో భావనచేయవలెను. పంచ దార, తేనె, నెయ్యి మొదలగువాని ననుపానముగా బెట్టుకొని యౌషధ మును రెండుగురిగింజలంత ప్రమాణమును భుజించినయెడల సమస్తమేహ ములు, క్షయ, బలహీనత నశించును. ఇంద్రియవృద్ధి గలిగించును. ఈ యౌషధమును భార్యయున్న గృహస్థులే భుజింపవలెను. చక్కని సంతా నము కలుగును. అమితమైన కామోద్రేకమును గలిగించుననుట కిసుమంత యైన సందియములేదు,

కాలపురుషోత్పత్తి.

శ్లో॥ ఆదౌకృతయుగేబ్రహ్మా మహేశం వాక్యమబ్రవీత్ ।
తవాజ్ఞయా మహాదేవా సృష్టానానావిధాఃప్రజాః॥

సమస్తామత్స్యలై ర్వాప్తా భవంత్యన్యేఽపితద్విధః।
కామేనయోంతిభార్యాసు పునఃసృష్టిః ప్రవర్తతే।
గజైరశ్వైర్మనుష్యాద్యైర్వ్యాప్తేయంతుధరాఖిలా।
శీఘ్రంయాస్యతిపాతాళేత్వత్రయత్నో విధీయతామ్।
ఏవం బ్రహ్మవచశ్శ్రుత్వా శూలమై త్తన్మహేశ్వరః।
తతోజజ్ఞేపుమానేకో భీమోఘోరపరాక్రమః।
రక్తాంతలోచనఃక్రోధీ బడబాగ్నియుతోనరః।
ఊర్ధ్వకేశోలలజ్జిహ్వః కృతక్రోశోజితేంద్రియః।

పూర్వము సత్యయుగంబున కమలాసనుండు మహాదేవునితో నీవిధముగ వచించెను. మహానుభావా! మీయాజ్ఞానుసారంబున నెన్ని యోమారులు నానాప్రకారంబుల ప్రజలను బుట్టించితిని ఈ ధాత్రీతల మంతయు నాచే బుట్టింపఁబడిన గజాశ్వ మనుష్యాది జీవజాలముచే నిండి యుండ, నాజీవకోటులును కామోద్రేక వశంబున స్త్రీలోలులై ప్రవర్తించుచున్నారు కాన క్రమక్రమంబుగ సృష్టియంతయు తనంతటతానే వృద్ధిబొందుచున్నది. ఈభారంబును సైపనోపకయిప్పుడో యింకనో భూమండలంబంతయు పాతాళమువరకు క్రుంగిపోవునని దలంచుచున్నాను కాబట్టి ఏదేని యుపాయము యోచించుట యవశ్యకర్తవ్యమైయున్నది. ఆమాటలనువిని పరమేశ్వరుడు తన త్రిశూలము దిలకింప నాశూలాయుధ మునుండి భయంకరాకృతి గలవాడును ఘోరపరాక్రముండును నగు నొక పురుషు డుద్భవించెను కాలమృత్యువుబోలె ఝలిపించుచు నిప్పుల కుప్ప యో యనునట్లు రక్తవర్ణముగల కన్నులతో భీకర రౌద్రమూర్తియై బడ బానలమును వెంటగొనియోనోయన తలవెంట్రుకలు చిందర వందరలై చిందులాడుచు వ్రేలాడుచు నాలుకను చప్పరించుచు సాచుచు పండ్లు పటపటగొఱుకుచు నోడలెరుంగక మత్తిల్లియొక్క బొబ్బరింతబెట్టి నిలువ బడెను.

భవితవ్యతా జననము.

శ్లో॥ తందృష్ట్వాతు మహాదేవః పార్వతీం వాక్యమబ్రవీత్
జాతఏవమహాఘోరః స్సర్వసంహారకారకః

ఏతస్య మోహనార్థాయ దేహాభార్యాంయధోచితః
ఏవంశివవచశ్శ్రుత్వా స్వాకం పృష్ఠందదర్శహా
తతోదేవిసముత్పన్నా యోషాచ్యాతే భవితవ్యతా
రూపలావణ్య సంపన్నా పీనోన్నత పయోధరా
మారణాస్త్రం మోహనాస్త్రం కరాభ్యాందధతీశుభా
శ్వేతవస్త్రపరిధానా లజ్జావాప్తివృతలోచనా
సాప్రణమ్యతతా దేవీ శివయోరగ్రతస్థితా
శస్త్రశాలభరాక్రాన్తా కాలచిత్త విమోహినీ
దృష్ట్వాతాం పార్వతీప్రాహమమాజ్ఞా క్రియతామితి
కాలస్య భవపత్నీ త్వ మతశ్చిత్తం విమోహయ
యాచయస్వవరం శ్రేష్ఠం కురుకార్యం ప్రజాయతే
తతః ప్రీతాతు సాప్రాహ దేవ్యగ్రే ప్రణతాస్థితా
మమాధీన మిదంసర్వం బ్రహ్మవిష్ణు శివాత్మకం
కాలశ్చాయం మమాధీనః కోపిమాం నహివేత్స్యతి
అబ్రహ్మస్తంబ పర్యంతం విష్ణోర్దేవ్యాంచశూలిని
దృష్టిర్మమనమైవాస్తిమత్స్వరూపా ఉవిదస్త్విమే
ఏవముక్త్వా భవాన్యాసా పాణిగ్రహ మచీకరత్
కృతకృత్యో భవత్కాల ఉద్వాహ్యభవితవ్యతామ్॥

వీడు మహాక్రూరుండని చింతించి పరమేశ్వరుడు పార్వతివంకకు దిరిగి 'వీనిని మోహింపజేయునట్టి యొక్క యువతిని సృజించి భార్యగా నీయవలయునని యాజ్ఞయొసంగ' నాపార్వతియు దన వీపువైపునకు దిరిగిజూడ నామె వెనుకవైపునుండి రూపలావణ్య సంపదలతో గూడి వత్రువయ్యు, నించుక యెత్తుగలిగి, మనోహరంబులైన కుచంబులు వలపుగులుక తెల్లని వలువధరించి మారణాస్త్రంబును మోహనాస్త్రంబును కరములదాల్చి లజ్జావశంబున నర్థమీలితంబులగు నేత్రములతో సొంపునివుడు భవితవ్యత యను నొక్క దివ్యాంగన మందగమనముల తోడ నపార్వతీ పరమేశ్వరుల యగ్రభాగంబునకు వచ్చి వారలకు దండప్రణామంబు లాచరించి శస్త్రభారవాహనాది క్రియానిరతుండగు

కాలుని మనస్సును పైతము మోహసాగరమున ముంచివేయ దలంచుచు నిలువబడెను.

నీవు నాయాజ్ఞ చొప్పున కాలపురుషుని వివాహ మొనర్చుకొని యాతని మోహింపజేయుచు, చతుర్ముఖుని యొక్క కార్యంబు నిర్వహించు నట్లొనర్చుమని పార్వతి వచించు వాక్యములను శిరసావహించి సంతుష్టురాలై యిట్లు వచించెను.

బ్రహ్మ విష్ణు శివాత్మకంబగు నీజగంబంతయు తదధీనంబు కాలుడును నాకు వశుడు ఒక్కడును నన్ను దెలియజాలడు బ్రహ్మ మొదలుకొని స్తంభమువరకు గల ప్రపంచమంతయు సమదృష్టితోడ వీక్షింపుచుండెదను నా స్వరూపంబును దెలియజాలరు సర్వప్రపంచము నాయాధీనములో నున్నది.

పిమ్మట కాలునకును భవితవ్యతకును వివాహమయ్యెను. కాలుడును తనలో తాను కృతకృత్యుండనైతినని దలంచెను.

కాలునకు జ్వరము మున్నగు భృత్యగణమును సృజించుట.

శ్లో॥ కృతోద్వాహంతుతంజ్ఞాత్వా విధాతావాక్య మబ్రవీత్
శీఘ్రమాగమ్యతాం స్వామిన్ సృష్టిసంహార్యతామితి
తతస్తుభృత్యాః కాలేన రచితాస్స్వస్వతేజసా
భవితవ్యతయాసార్థం తతస్స్వ స్వామితేజసా
శోషోజ్వరః పాండు కాస శ్వాస పానాత్యయాదికాః
ఆభ్యన్తరాగిరిచరాశ్చతశ్శస్త్రేననిర్మితాః
సర్పావ్యాఘ్రము వృకాస్సింహా వృశ్చికారాక్షసాగజాః
భూతప్రేత పిశాచాశ్చ బాహ్యస్థాః పరిచారికాః
తస్యాభ్యంతర శక్త్యాచ కామినీ మోహినీత్రపా
లజ్జాహం కృతిబుద్ధ్యా నిద్రా ద్వేషభయాదికాః
గృహణీకామశూలాశూ చీఛర్దిర్మూర్ఛాశ్మగీతృషా
శాకినీ ఢాకినీ ఘోరా ఇత్యాద్యాబాహ్య హేతుకాః
ఏవంపరివృతం దృష్ట్వామనస్యేవం విచారయత్
మత్తతోఽ ప్యధికోలోకే నజానే భవితవ్యతామ్

బ్రహ్మావిష్ణుమహేశాద్యా పానసీయాః ప్రమాదతః
ఏవం విచార్యమనసి మహేశం హంతుముద్యతః॥

అనంతరము చతుర్ముఖుడు వివాహితుడైన కాలునితో 'స్వామీ! శీఘ్రముగ దయచేయుము సృష్టిని సంహరింపుము' అని ప్రార్థించెను.

అంతట కాలుడు భవితవ్యతా సహాయమువలన తన ప్రభావాతిశయంబునను, క్షయ, జ్వరము, పాండువు, కాసము, శ్వాసము, పానాత్యయము మొదలగు రోగ రూపములైన ఆంతరంగిక భృత్యులను సర్పములు, వ్యాఘ్రములు, తోడేళ్ళు, సింహములు, వృశ్చికములు, రాక్షసులు, గజములు, భూతములు, ప్రేతములు, పిశాచములు మొదలగు బాహ్యపరిచారకులచు.

అభ్యంతర శక్తివలన మోహినియను శక్తిని తృష, అహంకారము, బుద్ధి, ఆధి, నిద్ర, ద్వేషము, జయము, మొదలగు భృత్యగణములను, బాహ్యశక్తివలన, గ్రహణి, కామిల, విషూచిక, వమనము, మూర్ఛ, అశ్మరి, తృష, శాకిని, ఢాకిని, మొదలగు భృత్యవర్గమును భూభారము హరింపజేయుటకై సృజించెను. ఇట్లు సంపూర్ణసైన్యంబు నాయత్తపరచుకొని ఇంక లోకంబున నాకన్న నధికుడెవడు? భవితవ్యత యెట్లు నడుపించునో దెలియనేరనని దలంచుచు మున్ముందు బ్రహ్మ మహేశ్వరుల సంహరింపవలయునని దలంచి మహాదేవునిదగ్గరకు జేరి జంప నుద్యుక్తుడయ్యెను.

## శీతలాజననము.

శ్లో॥ తం దృష్ట్వాతు మహేశేన శక్తిరేషా ప్రదర్శితా
అతిఘోర విరూపాక్షీ సంకీర్ణ జఘనోదరీ
దంష్ట్రా మానకోపేన జ్వాలయంతీ దిశోదశ
తస్యాస్తు దృష్టిపాతేన కాలస్సర్వాంగపీడితః
నానాస్ఫోటైః పరివృతో దహ్యమానోరుహాగ్నినా
తస్యైదృశీమవస్థాంతు దృష్ట్వా దాహాదయోగపాః
తత్రైవావివిసుస్సర్వేకః ప్రభుః కశ్చ సేవకః
బలినస్సకలావశ్యాస్సేవకా నిర్బలస్యన

భగ్నాహంకారకం దృష్ట్వా తంకాలం భవితవ్యతా
ఈషద్విహస్యతం ప్రాహనతే సాధుః హంకృతిః
మదధీనం జగత్సర్వం మదాజ్ఞాక్రియతాం త్వయా
త్వయాస్వత స్తతారంభః కృత స్తేనే దృశీగతిః
ఏషామదంశసంభూతా శీతలాం తాం ప్రసాదయ
అవశ్యం తవసాహాయ్యం కరిష్యతి త్వయాదృతా॥

పరమేశ్వరుడు వాని భీకరాకారంబును కృత్యంబుతో జూచి జఘనము వరకును వ్రేలాడు దీర్ఘోదరంబులో ఘోరరూపిణియు రోషాగ్నివలన ప్రజ్వలించుచున్న కన్నులు గలదియునగు నొక్క మహాశక్తిని గనుపరచెను పదిదిక్కులనొక్కసారిగ మంటబెట్టునట్లున్న యా మహాశక్తి దృష్టిప్రసారంబు సోకిన మాత్రముననే కౄరుడగు కాలుని యొడలంతయు నానావిధములగు స్ఫోటకంబులచే నిండి భగభగమని మండప్రారంభించెను.

ఇట్టి దుస్థితి నవలోకించి దాహాది రోగంబులు నావహింప ప్రారంభించెను. లోకంబున బలవంతునకు నందరును భృత్యులుగాక శక్తిహీనుల కొకరైన సాయపడరుగదా!

ఇట్లహంకారంబు దొరంగి యభిమానంబు చచ్చిపడియున్న కాలునిచూచి చిఱునవ్వునవ్వి భవితవ్యత యిటులంబలికెను. నీకింత పరహంకారంబు గూడదు నీవు స్వతంత్రించుటవలననే యిట్టిదారుణమైన దుస్థితి వాటిల్లినది ప్రపంచమంతయు నావశమైయున్నది కాన నాయాజ్ఞా ప్రకారంబు వర్తింతువేని సర్వశుభంబు లొనగూడును. ఇమ్మహాశక్తియు మదంశ సంభూతురాలగు శీతలయనంబరగును ఈమె నారాధించితివేని నీకెట్టి కష్టములును రాకుండ కాపాడును.

కాలుడు శీతలను స్తుతించుట.

శ్లో॥ అస్యశ్రీశీతలాస్తోత్రస్య దేవర్షిః
అనుష్టుప్ఛందః శీతలాదేవతాలక్ష్మీర్బీజమ్ భవా
నీశక్తిః సర్వవిస్ఫోటక నివృత్తయే జపేవినియోగః

ఈశ్వర ఉవాచః—

శ్లో॥ వందేహం శీతలాం దేవీం రాసభస్థాందిగంబరాం
మార్జనీకలశోపేతాం శూర్పాలంకృతమస్తకామ్

వందేహం శీతలాం దేవీం సర్వరోగభయాపహామ్।
యామాసాద్యనివర్తేత విస్ఫోటకభయంమహాత్॥

శ్లో॥ శీతలే శీతలే చేతియోబ్రూయాద్దాహపీడితః
విస్ఫోటకభయం ఘోరం గృహేతస్య నజాయతే
శీతలేజ్వరదగ్ధస్య పూతిగన్ధగతస్యచ
ప్రణష్టచక్షుషః పుంసస్త్వామాహుర్జీవనౌషధమ్
శీతలేతనుజాన్రోగాన్నృణాం హరసిదుస్తరాన్
విస్ఫోటకవిశీర్ణానాంత్వమేకామృతవర్షిణీ
గలగణ్డగ్రహారోగా యేచాన్యేదారుణాన్నృణామ్
త్వదనుధ్యానమాత్రేణ శీతలేయాన్తి సంక్షయమ్
నమన్త్రం నౌషధంతంత్రం పాపరోగస్యవిద్యతే
త్వమేకాశీతలేధాత్రీ నాన్యాంపశ్యామిదేవతామ్
మృణాళీతన్తుసదృశీం నాభిహృన్మధ్య సంచితామ్
యాస్త్వాంసంచిన్తయేద్దేవితస్యమృత్యుర్నజాయతే॥

చేతులయందు కలశంబును, చీపురుకట్టయును, శిరంబున చేట ధరించుకొని దిసమొలతో గాడిదపై నెక్కి యొప్పుచున్న శీతలా మహాదేవికి నమస్కరించెను.

ఏ మహాదేవియొక్క ప్రాపు జేరినయెడల ఘోరమగు విస్ఫోటక భయము నివారణమగునో యట్టిరోగభయసంహారిణియగు శీతలాదేవికి మ్రొక్కుచున్నాను. విస్ఫోటక రోగంబున దాహపీడితుడై యెవ్వడు 'శీతలా శీతలా' యని స్మరించునో వానియింట విస్ఫోటక భయంబు లుండవు.

ఓ శీతలాదేవీ! తాపజ్వరముచే మంటలెత్తినవానికిని దుర్గంధముతో గూడిన వానికిని కన్నులుపోయినవానికిని జీవనాధారభూతంబగు నౌషధమువంటి దానవని పెద్దలు వచించెదరు.

మానవుల శరీరమునందు జన్మించిన దుష్టములగు రోగములనెల్ల బారదోలుదువు. స్ఫోటకమువలన శిథిలమైన శరీరముగలవారికి యమృతవర్షమును గురిపించి యానందమును గలుగజేయుదువు.

గల గండముగల గ్రహములు మొదలగునవి దారుణములగు రోగములు నీనామస్మరణమును జేసినమాత్రముననే దూరమగును.

పాపరూపంబులగు యీ మహారోగంబులకు మంత్రములుగాని ఔషధములుగాని లేవు. నీవొక్కదానవే రక్షింపగల సమర్థత గలదానవు మరియేదేవతయు గాపాడజాలదు.

నాభికిని హృదయమునకు మధ్యభాగమున తామరతూటితో నుండు దారమువలె ప్రకాశించుచున్నట్టి నీ స్వరూపమును ధ్యానించు వారలకు మృత్యువు సయితమురాదు.

**శీతలాదేవి కాలునకు వరమలిచ్చుట.**

శ్లో॥ ఏవం స్తుతా తదా దేవీ శీతలా ప్రీతమానసా
ఉవాచవాక్యం కాలాయ వరంవరయసత్వరమ్॥
శ్లో॥ అహోచాద్భుతమాహాత్మ్యం తదదృష్టం మయాధునా
పీడామమతుమాక్షిప్రం ప్రహర్షం కురు తేసదా॥

శీతలోవాచ

శ్లో॥ ఏషాశివ జగత్కర్త్రీ భార్యేయం భవితవ్యతా
అస్యాఆజ్ఞాంప్రవర్తన్తే బ్రహ్మవిష్ణు మహేశ్వరాః
అహంత్వంచ మహేశాద్యా మమాధీనా స్తుతస్మతాః
బుద్ధ్యధీనాశ్చతాయంతే వ్యాధ్యక్షీ భవితవ్యతా
సాహోయం తే కరిష్యామి హరిష్యామి ప్రజాఇమాః
ఉపాదనీతు యాఖాదే దాదాపుష్టం తతఃపరమ్
తంగర్భభక్షయిష్యామి సాపిచేద్దుష్టభాగ్భవేత్
సన్తుష్టాశీతలేనాహం సదాతేసేవకస్యచ॥

పైన జెప్పినరీతిగ సంస్తుతింప నద్దేవియు ప్రసన్నురాలయి నీకు వలయువరంబులు వేడుమన నమ్రుడై యిట్లనియెను. జననీ అద్భుతమగు నీమాహాత్మ్యమునుగనుగొంటిని నీయనుగ్రహమున నాపీడయంతయు నివర్తింపజేసి పరమానందము నొందింపుము. అని ప్రార్థింప నద్దేవియు, ప్రసన్నురాలయి నీకువలయువరంబు వేడుమననమ్రుడై యాతడిట్లనియె

అమ్మా అద్భుతమగు నీమాహాత్మ్యమును గనుగొంటిని నీయను గ్రహమున నాపీడనంతయు నివర్తింపజేసి పరమానందంబు నొందించుము అనిశేడ నద్దేవియు నీభార్యయగు భవితవ్యత ననుసరించియే జగత్తంత యు నుద్భవించుచున్నది బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నీమెయాజ్ఞ ననుస రించి ప్రవర్తించుచుందురు.

నీవును నేనును మహేశ్వరాదులుంగూడ భవితవ్యత యొట్లుండు నో అట్లే బుద్ధికధీనులమగుచుండుదము ప్రజలను సంహరించుచు నీకు సర్వ విధముల సహాయపడుచుందును.

ప్రథమ రజస్వలయగు చిన్నది ఆదియందుష్ణ పదార్థముల భుజించి యటుపిమ్మట నుష్ణభోజనము చేయునేని యాస్త్రీకి గల్గెడి గర్భంబుల నాశమొనర్తును శీతలపదార్థములను భక్షించెడివారలు నాకు పరమ ప్రీతులని తెలియుము.

శ్లో॥ ప్రత్యహం యాసమశ్నాతి మూలత్యార్క-ముపోదకీ
తస్యాగర్భంనస్పృశామి యావజ్జీవం నసంశయః॥
శ్లో॥ మనుకోపేనసంయాంతం దాహోయస్తునరోత్తమ
దధిభుక్తం బ్రాహ్మణేభ్యో జలమేభ్యః ప్రదాయచః
శ్లో॥ స్వయమశ్నాతిసప్తాహం తస్యపీడాం హరామ్యహమ్
అష్టకంచమమైతద్ధి యఃపఠేన్మానవస్సదా
విస్ఫోటకభయంఘోరం కులేతస్య నజాయతే
శ్రోతవ్యం పఠితవ్యంచ నరైర్భక్తి సమన్వితైః॥
శ్లో॥ ఉపసర్గ వినాశాయ పరంస్వస్త్యయనంమహత్
శీతలాష్టకమేతద్ధిన దేయం యస్యకస్యచిత్॥
శ్లో॥ దాతవ్యం సర్వదాతస్మైభక్తిశ్రద్ధాన్వితోహియః
ఏవముక్త్వా స్తతస్సర్వే యత్రైవభవితవ్యతా॥
శ్లో॥ తథాలోకాకబీఘాం సన్తికాలస్యవశమాగతాః
అథవక్ష్యేశీతలాది చికిత్సాసర్కంప్రభావతః॥

తా॥ ప్రతిదినము జాజిపూవుల యర్కమును సేవించు గర్భవతికి జీవితకాలములో నెన్నడును గర్భబాధలను గలిగింపనని నిశ్చయముగా నెఱుంగుము నాయాగ్రహమున జన్మించిన దాహమువలన పీడితుండగు వాడు దధ్యోదనమును చల్లని జలమును విప్రులకొసంగి తానును నేడు దినంబులు భుజించిన యెడల యాబాధలను దొలగింతును.

పైనుదహరించిన నాయష్టకమును పఠించువారికెట్టి బాధలును రాకుండ గాపాడెదను భక్తియుక్తులై సర్వమానవులు నుపద్రవములు రోగములును గలుగకుండ సర్వశుభంబులు చేకూరుటకుగాను నాయష్టకమును పఠింపుచు నుండవలెను ఈశీతలాష్టకమును భక్తిశ్రద్ధలతో గూడిన వానికి దప్ప యితరున కొసంగరాదు.

అని యిట్లు శీతలామహాదేవి యానతిచ్చిన యనంతరంబ యెల్ల సైన్యంబులును భవితవ్యతానుకూలంబుగ కాలునకు వశవర్తులై సృష్టి సంహారమునకు సమకట్టెను.

### శీతలాహారంబులైన యర్కములు.

శ్లో॥ జాత్యర్కం వా కదల్యర్కం శతపత్రార్కమేవవా
యోభుంజ్యాద్దధి భక్తాభ్యాం శీతలాతం నమారయేత్
చన్దనం వాసకోస్త్రాం గుడూచీం ద్రాక్షయాసహ
ఏషామర్కశ్శీతలశ్చ శీతలాజ్వరనాశనః॥

జాజిపుష్పముల యర్కము, అరటిపండ్ల యర్కము, తామర పువ్వులయర్కము, సేవించి పెరుగన్నము భుజించినవారికి శీతలహింసింపదు. చందనము, అడ్డసరము, తుంగగడ్డలు తిప్పతీగ, ద్రాక్ష ఈయోషధుల యర్కము శీతలమైనదియు శీతలాజ్వరమును హరించు నదియు నగును.

### శీతలామంత్రము.

శ్లో॥ తారోమయాశీతలేతి చతుర్థ్యన్తంహృదన్తకమ్
మన్త్రముచ్చార్యయోదద్యాల్లేద్దధీనిశతసంఖ్యయా

సచన్ద నేనశీతేన శతపత్రార్క కేణచ
అవశ్యమేవసప్తాహ ప్రియోగా ద్వ్రిణనాశనః॥

'ఓం హ్రీం శీతలాయైస్వాహ' అనుమంత్రరాజమును శతసంఖ్యచే జపించి చందనార్క శతపత్రార్కముతో గూడిన పెరుగును ఏడుదినములు ప్రయోగించినయెడల వ్రణములు నివారణమగును.

ఇది

(ఆజవ ప్రకరణము)

ఆయుర్వేద వైద్యసారామృతము,

సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

